# చండిక.



(గ్రంథకర్త:—ముత్తనేని వేంకట చెన్నకేశవులుగారు)

చండిక స్వాతంత్ర్యమంటప ప్రదీపిక, చండిక సౌందర్యవా[రాశి] సమృద్ధి చంద్రిక, చండిక సముదారాతిమ్రమకుతారిక. చండికాచరిత్ర మతివిచిత్రము; సూక్ష్మదృష్టిం బరికించువారికిఁ జండిక భామినీరూప బ్రహ్మరాక్షసి; కామినీరూప మృత్యుదేవత. స్థూలదృష్టిం బరికించు వారికిం జండిక వీరపత్నీ శిరోరత్నము; పరమసాధ్వీతిలకము. చండిక కౌక్షేయముతోఁగానిపనిఁ గటాక్షముతో నెఱవేర్చినది. కత్తిఁబట్టుకొని కదనరంగమున కుఱికినది. రక్తముగార్చి రాజ్యము సంపాదించిన చండికకు స్వాతంత్ర్యమే స్వర్గలోకము; పారతంత్ర్యమే ఘోరనరకము. భర్తృస్వాతంత్ర్యమునకుఁ జండిక పడినపాట్లు చెప్పిన దీఱవు. పతి బ్రభువుం జేయుటకుఁ జండిక పన్నిన తంత్రములు వర్ణనాతీతములు. పతిహితవర్తనమే చండికకుఁ బరమధర్మము. భర్తకొఱకుఁ జండిక పాప భీతి విడిచినది. ఘోరహత్యలు గావించినది. పాంసుల యను దుష్కీర్తి నందినది. తుదకు భర్తకు రాజ్యమార్జించినది. కానికట్టకడకు చండికకు బైటకొంగే పామై కరచినది. భర్తయే పగఁదలంచి చండికను బగతుర కప్పగించినాఁడు. ఆభిజాత్యసంపన్న యగు చండిక ఆత్మహత్య గావించుకొనినది. ఇంతటి సాహసిక—ఇంతటి వీరకాంత—ఇంతటి నెఱజాణ చరిత్రము మీ రిదివఱకుఁ గని విని యుండరు. వెల రు. 1—0—0

శైలికి గొన్ని పద్యములు:

శా॥ పాణిం గ్రూరకృపాణిఁ బూని బలవత్ప్రత్యర్థి భూభృద్భట
శ్రేణిం దాఁకి, యసృక్ప్రవాహముల నుర్విం గార్చినం గాక, యీ
క్షోణీరాజ్యము శూరభోజ్య మెటు వచ్చుం గా ముండ లట్లిండ్లలోఁ
బ్రాణాశం బడి వేడియశ్రులఁ గార్చన్ క్షత్త్రియాగ్రామణీ!

గీ. కత్తిఁబట్టకున్న, నెత్తురోడ్చకయున్న, ఘోరబాధ కొందనేకున్నఁ,
బ్రాణిహింస సేయఁబాల్పడకున్నను లభ్యమౌనె రాజ్యలక్ష్మి యువిద!

వలయువారు:—

సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

# రంగూన్ మెయిల్

[ రంగూన్‌రౌడీ అనంతర కథ ]

6 అంకముల సాంఘిక నాటకము



గ్రంథకర్త :


సూరి పార్థసారథి శర్మ





ప్రకటనకర్తలు :

కురుకూరి సుబ్బారావు అండ్ సన్స్,

ప్రొప్రైటర్సు, సరస్వతీ బుక్ డిపో,

బెజవాడ.







మొదటికూర్పు: 1000 ప్రతులు

బెజవాడ : ఆంధ్రగ్రంథాలయము ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1939

# విజ్ఞప్తి

భాషాభిమానులారా!

ఇయ్యది "రంగూన్ రౌడి" యనంతరకథ. శ్రీ సోమరాజు రామానుజరావుగారు కీర్తిశేషులగుటచే నేనీ పొత్తమును రచించుటకు పూనుకొంటిని. పూర్వగాథల ననుసరించి నాటకమును రచించుటయే కష్టసాధ్యమైనపని. అట్టితఱి నిరాధారమైన సాంఘిక నాటకమును రంగస్థలానుగుణ్యముగ రచించుట యెంతవఱకు సాధ్యమో వేరుగ వ్రాయనక్కరలేదు. విశేష రంగస్థలానుభవముగల పెక్కుర యభిప్రాయములను గైకొని పాత్రపోషణయందేమి రసపోషణయందేమి సాధ్యమైనంతవరకు నీరసము దోపనీకుండ లిఖించితిననియే నా యభిప్రాయము. ఇందు నేనెంతవరకు కృతకృత్యుడనైతినో నిర్ణయింప పాఠకులే కర్తలు. ఎవరేపొత్తము రచించినను అందలి సారాంశము ఏదేనొక విధమగు నీతిబోధయేకదా! గ్రంథమునందలి గుణములను మాత్రమే పాఠకులు గ్రహించవలసిన విధియై యున్నది. నాటకమున రసోత్పాదనముకొర కనేకసంఘటనల నేర్పరచవలసి యుండును. దోషముల జూపినగాని గుణముల నిర్ధరించి నీతిగొల్పుట కవకాశము లభింపదు. కావుననే, సచ్చరితుడగు మోహన్ రావు వ్యాపారమునందు నష్టము సంభవించి మిత్రవంచకుల మోసములం జిక్కి దుర్వ్యసనములం దవిలి కడు నిడుమలబడి పశ్చాత్తప్తహృదయుడై తుదకు తిరిగి యున్నతస్థానము నాక్రమించుటయే యీ రంగూన్ మెయిల్ నాటకమునందలి కథాంశము. దుర్వ్యసనముల నిరసించి సన్మార్గముల వ్యక్తపరచుటయే యిందలి నీతి. రంగూన్ రౌడీనాటకముయొక్క కాపీరైటు

హక్కు శ్రీ కురుకూరి సుబ్బారావుగారిదియే యగుటచేతను ఈ రంగూను మెయిలు రంగూన్ రౌడీ యనంతరకథ యగుటచేతను సంబంధ బాంధవ్యముల గూర్చుటకు రౌడీ కథయందలి కృష్ణమూర్తి జానకి మోహన్‌రావు రాజారాముల పాత్రలనే ప్రధానములుగ గైకొని కృష్ణమూర్తి పుత్రికనే మోహనరావు భార్యగ సృష్టించి రౌడీకన్న నగ్రస్థానమో లేక సమస్థానమో వహింపవలయు నని కృషిసల్పి వ్రాసితిని. ఈకథ ప్రత్యేక సంస్థనుగూర్చికాని, యితర గ్రంథములనుండి సంగ్రహించి కాని, రచింపఁబడినది కాదు. ఇందలి పాత్రలుగూడ ప్రత్యేక వ్యక్తులను గూర్చి సృష్టింపబడినవి కావు. ఒకవేళ యిందలి పాత్రలంబోలిన వ్యక్తులున్నను, యీ పాత్రలు తమ గుణగతముల వెల్లడించుటకై సృష్టింపబడినవను దురభిప్రాయముల నొందకుందురుగాక యని నాప్రార్థన. ఈ ప్లాటు కుదుర్చుకొనుటకే రెండు సంవత్సరములు పట్టినదనిన, రచించుట కెంతకష్టించితినో చదువరులే గ్రహింతురుగాక ! పొత్తము నచ్చొత్తింపక పూర్వమే, యీ రంగూన్ మెయిలు నాటకమునకు సుమారు 300 ఆర్డర్లు వచ్చి నా యుత్సాహమును హెచ్చించి, యింత శ్రమ సహించుటకు కారణములైనవి. బ్రహ్మసృష్టియందుకూడ నేదియో యొక లోప ముండకమానదు. "ప్రమాదో ధీమతామపి." అట్టి తరి కించిత్ జ్ఞుండనైన నాయీ పొత్తమునం దెట్టి ఛిద్రములును లేవని చెప్పజాలను. గుణగ్రహణ పారీణులగు మా చదువరుల కట్టి ప్రమాదంబు లేవేని స్పృహించినచో, నాకుగాని, ప్రచురణ కర్తలగు శ్రీ కురుకూరి సుబ్బారావుగారికిగాని తెలియపరచినచో కృతజ్ఞతాపూర్వకముగ నందుకొని ద్వితీయ ముద్రణమునం దా యుత్పాతంబుల పొత్తమునుండి తొలగించుకొన గలవాడను. కాపీరైటు ఆక్టు ననుసరించి ఈ పొత్తమునకు గల సర్వాధికారములును తగిన ప్రతిఫలము గైకొని బెజవాడ సరస్వతీ బుక్కుడిపో ప్రొప్రైటర్సు కురుకూరి సుబ్బారావు అండు సన్ వారికి వ్రాసి యిచ్చితిని. ఈపొత్తము

ప్రచురించుట, నాటక ప్రదర్శనమునకు, టాకీఫిల్మ్ దీయుటగాని భాషాంతరీకరణము చేయుటగాని గ్రామఫోను రికార్డింగు చేయుటగాని ఇత్యాది పనులకు పూనుకొనదలచువారు శ్రీ కురుకూరి సుబ్బారావు అండ్ సన్ వారి వ్రాతమూలకమగు అనుమతిబొంది తమ యుద్యమములను కొనసాగించుకొందురుగాక యని హెచ్చరించుచున్నాను. అచ్చొత్తించక పూర్వమునుండియే అనేక సమాజములవారు యీ నాటకము ప్రదర్శించుటకును, టాకీఫిల్మ్ తీయుటకును సంకల్పించుకొన్నట్లు వినుచున్నాను. అంతటి మహదానందము నాకు త్వరలో గలుగగలందులకు భగవంతుని ప్రార్థించుచున్నాను. పాఠకమహాశయులొసంగు ప్రోత్సాహమునుబట్టి మోహనరావు కుమారుడగు శ్యామసుందరుని చరిత్రగూడ రచింప నుద్యుక్తుడ నగుదునేమో ?

బెజవాడ,
1—6—39

ఇట్లు సుధీజనవిధేయుడు,
సూరి పార్థసారథిశర్మ.



## హెచ్చరిక

ఈ రంగూను మెయిలు నాటకము కాపీరైటుయొక్క సర్వాధికారములు మాకు జెందియున్నవి. కావున వ్రాత మూలకమైన మా పర్మిషన్ లేనిదే యే సంఘముగాని యే నటీనటులుగాని ప్రదర్శింపరాదు. మరియు గ్రామఫోను రికార్డింగు, టాకీ స్క్రీనింగు, యితరభాషలలోనికి తర్జుమా వగైరాలు చేయగూడదు. ఇందలి పదములుగాని, భావములుగాని ఏ మాత్రము కాపీ చేయకూడదు. అట్లు అతిక్రమించినవారలు మేము జరుపు సివిల్ క్రిమినల్ చర్యలకు బాధ్యులగుదురని యిందుమూలముగా తెలియపరచడ మయినది.

ఇట్లు కాపీరైటు హక్కుదార్లు,

బెజవాడ,
11–8–39.

కురుకూరి సుబ్బారావు అండ్ సన్,
ప్రొప్రయిటర్సు, సరస్వతీ బుక్ డిపో.

# ఇందు వచ్చు పాత్రలు



1. మోహనరావు ... కథానాయకుడు, శంకరరావు కొడుకు
2. కృష్ణమూర్తి ... నాయకుని మామగారు, శంకరరావు బావమరది
3. వెంకట్రావు ... మోహనరావు స్నేహితుడు
4. రాజారాం ... గంగారాం సేటు కొడుకు, వెంకట్రావు సహచరుడు
5. వెంకడు ... వెంకట్రావు కమతగాడు
6. సబు యినస్పెక్టరు
7. ఇద్దరు పోలీసులు
8. శర్మ } వకీల్సు
9. చౌదరి }
10. జడ్జి
11. కోర్టు జవాను
12. గోవిందరావు ... స్టీమరులో గుమాస్తా
13. సేవకుడు ... మోహనరావు యింటియందు

## స్త్రీలు :

1. సుశీల ... కథానాయకి, మోహనరావుభార్య, కృష్ణమూర్తి కుమార్తె
2. జానకి ... సుశీలతల్లి, కృష్ణమూర్తిభార్య, శంకర్రావు చెల్లెలు
3. వారిజ ... వేశ్య, వెంకట్రావుని యుంపుడుగత్తె
4. శాంత ... వెంకట్రావుభార్య
5. మల్లి ... వెంకనిభార్య
6. హాస్పటల్ నర్సు

ఇంకను ప్రథమరంగమున ప్రయాణీకులు, వ్యాపారస్థులు రంగూన్ మెయిల్ కొట్టుకొనిపోయిన సందర్భమున వత్తురు.

# రంగూన్ మెయిల్

## ప్రథమాంకము

### ప్రథమరంగము

[కాకినాడయందలి సముద్రతీరము: జనులందరును కోలాహలము చేయుచుందురు. రంగూన్ మెయిల్ కొట్టుకొనిపోయిన దని కేకలు వేయుచుందురు. ప్రయాణీకులబంధుగుల యార్తనాదములతోను, వ్యాపారస్థుల ఆతురతతోడను, ఓరున వీచుచున్న గాలితోడను, బీభత్సము గొల్పుచుండును.]

మోహనరావు—(ఆత్రముతో రోజుకొనుచు, పరుగెత్తుకొని వచ్చి) త్వరపడుఁడు. లైఫ్‌బోట్సు దింపి ప్రయాణీకుల నొడ్డు జేర్చుమని సిబ్బందికి కేకలిడి తెల్పుఁడు. ఆ స్టీంలాంచీలు చాలవు. లాంచీల డ్రైవర్లను ప్రోత్సహించుఁడు. ఇంకను నిచ్చటనే యుంటిరా? నావికులారా! మీ శక్తివంచనలేకుండ పాటుపడుఁడు. మీ కష్టము వృథపుచ్చను. మీకు కనకవర్షము గురిపించెదను. స్టీమరును చుట్టుముట్టుఁడు. నావికులారా! సాహసింపరేల? అట్లు లెత్తి చూచెదరేల? తాటినిచ్చెనలు విడువుఁడు. అదిగో, ఆ పసిబిడ్డ! అది! ఆస్త్రీని జాగ్రతగ దింపుఁడు. తాటినిచ్చెన నూగకుండ పట్టుకొనుఁడు. ఆవృద్ధురా లాత్రముచే సముద్రమున పడునేమో? జనులు త్రోసికొని వచ్చుచున్నారు. జాగ్రత! మెల్లగా! అదీ! ఓమహానుభావా! ఆజవ్వని కాలుజారి సముద్రమునఁ బడినది. లైఫ్‌బెల్టు (life belt) సముద్రమున విసరుఁడు. బెల్టు గట్టిగా నడుమునకు బిగించుకొమ్మని యామెను హెచ్చరించుఁడు. అదీ! అదీ! ధన్యుఁడను; ధన్యుఁడను. కళాసులారా! ప్రయాణీకుల రక్షించుటయే యిప్పుడు

ముఖ్యకర్తవ్యము. ప్రాణములకు తెగించుడు. అదిగో! అదిగో! ఆడింగీ తలక్రిందగుచున్నది. అందలి స్త్రీలను బాలురను నింకొక డింగీలోని కెక్కింపుడు. ఎవ్వరామె? పడె, పడె, హరి హరీ! నావ మునిగిపోయినది. ఆతొక్కిసలాట యేమి? ఓడ నిలుచుట లేదు. సమయమున కితరయోడ లేవియు లేవే? ప్రళయ ఝంఝూపిచికలచే నుద్భవించి పర్వతపంక్తులంబోలె పర్వులెత్తు చున్న సముద్ర తరంగములలో నా రంగూను మెయిలు దృష్టి గోచరమగుట లేదే? అబ్బా! ఈయిసుకదెబ్బలకు నా మొగ మంతయు వాచిపోవుచున్నదే! ఇచట నిలుచుట కష్టముగ నున్నదే. ఏవీ, ఏవీ, యీనావ లెటుపోయినవి? తరంగములకు తల క్రిందు కాలేదుకదా? లేదు లేదు. అదిగో, చెల్లాచెదరైన చీమల బారువలె పోవుచున్నవి. ఇంక ప్రయోజనము లేదు. అయ్యలారా! ధైర్యము వహింపుడు. పొండు. స్టీమ రెటుపోవుచున్న దో తిలకింపుడు. నా కేకలు వారలకు వినబడునా? అయిపోయి నది. నా పెన్నిధానము, నా బంగరు రంగూన్ మెయిల్ నడిసముద్రమున నంతర్ధానమైనది. కటకటా! కడగండ్ల కిది నాకు మొదలు కాబోలు. (అంత నొకడు డేకుచు వచ్చి)

ఒకడు—అయ్యబాబో; మోహనయ్యగారూ! గబ్బాదానమయ్యి నెలనాళ్ళు కాలేదు. పెద్దవాణ్ణి. యింకేడా పెళ్ళాం దొరకదు. పాపం సిన్నపిల్ల. రంగూన్ సూడాలంటే మా గుమత్తా యెట్ట పంతులతో పంపిత్తుండా. దేవుడా! మీటీమర్లో వుండారు బాబూ; అయిదేలెట్టి కొనుక్కున్న పిల్ల.

ఇంకొకడు—బాబూ! రంగూన్‌లో నాటకా లేడవాలని పెళ్ళాల పుస్తెల్తాళ్ళదగ్గరనుంచీ తాకట్టుపెట్టి బయల్దేరాం. యాక్టర్లంతా మీ స్టీమర్లో వున్నారు. నేనూ వ్రాళ్ళోనుండి వొచ్చేప్పటికి యీ పని జరిగింది. మా యాక్టర్ల గతేమిటి?

మరొకడు—అయిదు వేలరూపాయల సరుకయ్యా స్టీమర్లో వుంది, యేం చెపుతావు?

మోహ—అయ్యా! తొందరఁ జెందకుఁడు. ఓడ రేవునకై నను చేరక పోదు. కాకున్న మీనష్టముల నేను భరింతును.

[ఇంకకొందరు 'మావాళ్ళు, మాసరుకు,' అని మోహన్ రావును చుట్టు ముట్టుదురు]

వెంకటావు — [ప్రవేశించి] ఆగుఁడు. ఆగుఁడు. ఆయన నొత్తిడిచేయకుఁడు. (అనుచుండ తెరపడును.)



## ద్వితీయరంగము

[మోహనరావు గృహము: సుశీల ఆతురతతో ప్రవేశించి]

సుశీల—దాసీ! దాసీ! పిల్లవానిని జాగ్రతగ కాపాడుము. ఓహో! ఎంతటితుపాను! రోడ్లపై జలప్రవాహము మిట్టపల్లముల నేకముచేసి పారుచున్నది. ఎన్నివత్సరములనుండియో వేళ్లు పాతుకొనియున్న పెనుమ్రాకులు భూమిని పెకల్చుకొని నేలఁ గూలినవి. వృక్షశాఖలు విరిగిపడి జలప్రవాహము నడ్డగించుచు చీకాకు దోఁపఁజేయుచున్నవి. ఆహా! యీ బీభత్సమున కెందరి పూరియిండ్లు నేలమట్టమైనవో? ఎన్నిపశువులు మరణించినవో? ఎందరి కెంతలేసి నష్టములు సంభవించినవో కదా! నేఁడు రంగూన్ మెయిలు రంగూను ప్రయాణము సాగించెనా? అయ్యో! నా హృదయేశ్వరుఁడు సముద్రతీరమున కేగియుండెనే! ఈ భయంకరమగు తుపానున కెందు దాగియుండెనో? ధారాపాతముగఁ గురిసిన యీ వర్షమున కెచట తల దాచుకొనెనో? జడివాన యించుక శమించినను నా మనోహరుఁ డిలు సేరకుండెనే! ఏకారణముననో నామనసు కీడునే శంకించుచున్నదే. కుడిపార్శ్వముకూడ నదరుచున్నదే. ఏమి సేయుదును? నా నాథునిజాడ లెట్లెరుంగఁగలను? సేవకుఁ డెవరో పరువిడి వచ్చుచున్నట్లుండెనే.

సేవకుఁడు—(పరుగెత్తివచ్చి) అమ్మా! అమ్మా... యేమియో...

సుశీ—అయ్యయ్యో, యేమిప్రారబ్ధము సంభవించినదిరా? చెప్పవేమిరా? బాబుగారు సేమముగ నున్నారుగదా?

సేవ—ఆఁ.

సుశీ—అమ్మ, చంపితివిగదరా? అయిన నీ చెప్పఁబోవునదేమి?

సేవ—చెప్పుటకు నోరాడుటలేదు. మన రంగూన్ మెయిల్ ...

సుశీ—ఆఁ రంగూన్ మెయిల్ యేమైనదిరా? చెప్పవేమి? విసిగించెద వేమిరా?

సేవ—కొట్టుకొని పోయినది.

సుశీ—కొట్టుకొనిపోవుటయే?

సేవ—ఆఁ. నేను మరల సముద్రతీరమునకు పరుగెత్తుదును.

సుశీ—(వినిపించుకొనకయే) అకటకటా! ఎంతటిప్రమాదము సంభవించినది! అందెందరు పిల్లలు, పాపలు, స్త్రీలు, వృద్ధులు ప్రయాణ మొనర్చుచున్నారో కదా? యెంత సరుకున్నదో కదా! ఎందరు వ్యాపారస్థులకు నష్టము సంభవించెనోగదా? అయ్యయ్యో! నానాధుని, నాహృదయేశ్వరుని, నా దేవుని, తమ నష్టముల కేమి ప్రత్యుత్తర మిత్తువని యెందరు చుట్టుముట్టిరో? మాబంధుగుల గతి యేమని యెందరు బాధించుచుండిరో! ఎందరు దూషించుచుండిరో.

[అంత జానకీ కృష్ణమూర్తులు ప్రవేశింతురు]

సుశీ—(చూచి) తండ్రీ! తండ్రీ! నీయల్లుఁడు నీయల్లుఁడు; ముందాయన సేమముఁ గనుఁగొని రమ్ము.

కృష్ణ—ఇంకను రాలేదా? (అని త్వరగా నిష్క్రమించును.)

సుశీ—అమ్మా! అమ్మా! నాసౌఖ్య మంతరించినది. మాభాగ్యదేవత మాయమైనది. మా ద్రవ్యమంతయు నడిసముద్రమున కలసినది.

జాన—సుశీ! ఏల దుఃఖించెదవు? అంతయు వింటిమి; దైవకృప యిట్లున్నది.

సుశీ—దైవకృప? దైవమున కేమైన నెగ్గొనరించితిమా? దూషించితిమా? పూజించుట మానితిమా? ఏమేని దుర్మార్గము లొనరించితిమా? ఎవరినైన మోసగించితిమా? లేదే, లేదే! ఎట్టి క్రూరములును చేయలేదే! మాయందెట్టి కళంకమును లేదే! దైవమున కిట్టి పక్షపాతమా?

[అంత కృష్ణమూర్తి, మోహనరావు ప్రవేశింతురు]

మోహన్—(విచారముతో సోఫాలో చతికిలఁబడును)

సుశీ—నాథా! విచారించిన ఫలములేదు.

కృష్ణ—మోహనా! అసలింతటి యుత్పాతమునకు కారణ మెట్లు గల్గినది?

మోహన్—నేఁడు స్టీమరు రంగూన్‌కు ప్రయాణ మొనర్పవలసిన దినముగదా. ఓడయంతయు జనముతో క్రిక్కిరిసి యున్నది. గుమాస్తా వసూలుపైకముతో కూడ ఓడయందే యుండెను. ఇంజన్‌కు పిస్టన్‌రాడ్ (Piston-rod) విరిగిపోయినది. పిస్టన్‌రాడ్ కొరకు ఇంజనీరింగ్ స్టోర్సుకు వెళ్ళిన మనిషి రాలేదు. సాయంకాల మైదుగంటలప్పుడు పెనుగాలి వీచినదిగదా? దానికితోడు సముద్రముకూడ క్షోభము పొంగినది. ఆ యోరుగాలికి లంగర్లు తెగి యిట్టిస్థితి ప్రాప్తించినది. స్టీంలాంచీలతోడను, డింగీలతోడను, ఓడను నిలుప ప్రయత్నించితిమి కాని సాధ్యము కాలేదు. లైఫ్‌బోట్సువలన కొందరు ప్రయాణీకుల రక్షింప సమకట్టితిమి. కొందరు సముద్రమునఁ బడిరి. కొన్ని డింగీలు మునిగిపోయినవి. కొంద రొడ్డుఁజేర్పఁబడిరి. నా దురదృష్టముచే సమయమున కితరయోడ లేవియు రేవున లేవు.

సుశీల—కాదు; మీ దురదృష్టము కాదు. నా దురదృష్టము. ఇప్పటి వరకు నాయంతటి యదృష్టవంతురాలు లేదని గర్వించితిని. నా భాగ్యమునకు పొంగి పొరలితిని. అట్టి గర్వ మెవ్వరికిని తగదని బోధించుటకో యన నీశ్వరుఁ డిట్లు నా గర్వము సర్వము ఖర్వ మొనర్చెను. ఆనందసౌధమునుండి యొక్కసారి క్రిందికి ద్రొబ్బిం

చెను. నాకు కల్గిన యంతులేని సంతోషమునకు వెంటనే యంతటి దుఃఖ మనుభవింపఁజేసెను. ఈశ్వరుఁడు కఠినహృదయుఁడు, చపలచిత్తుఁడు. ఒకేవిధముగ మననీయలేఁడు. ఇంతటి దురదృష్టవతిగ నన్నేల సృష్టింపవలయును ?

కృష్ణ—సరి; ఇఁకఁజాలును. ఎవరిదురదృష్టమును కాదు. ఊరకొనుఁడు. అందరమును దురదృష్టవంతులమే. మీ యాన్నత్యహీనతలు మాకుమాత్రము సంతోషదుఃఖదములు కావా ? ఎల్లకాలము అందరును సుఖమే యనుభవించుచుండిన దుఃఖము లనుభవించువా రెవరు ? ఇందుల కింత విచార మెందులకు ?

మోహన్—మామగారూ ! సమయమునకు వెంకటూరావు రానిచో నే నేమయియుండెడివాఁడనో. నాబరువంతయు నాతనితలపై వైచుకొని సాధ్యమైనంతవర కందరను సమాధానపరచి యనేకప్రదేశముల కనేకయోడలకు టెలిగ్రాములు వైర్లెస్‌లు యిప్పించి యెంతయో సాయ మొనర్చెను.

సుశీ—ఇఁక నవియన్నియు నాపి భోజనమునకు లెండు, ప్రొద్దుపోయినది.

మోహన్—నా కాకలిదప్పులు నశించినవి. ఇప్పుడు నాకు రుచింపవు.

కృష్ణ—నాయనా ! ఇట్టితరి ధైర్యమే ప్రధానముగ నుండవలయును.

తే. గీ. సంపదల తులఁదూగుచు ♦ జగతియందుఁ
గొంకులేక చరించుట ♦ గొప్పకాదు
కష్టములు సంభవించిన ♦ కాలమందె
కూర్మిమెయి తాల్మిఁబూనుటే ♦ గొప్పతనము.

సుశీ—నీవు పోయి స్నానమునకు నీళ్ళుతోడుము. మోహనా ! విచారింపకుము. లెమ్ము.

మోహన్—ఇంక నొక్కటియే విచారము. నిర్విచారము. ఏమున్నది ? ఏ వ్యాపారమును గూర్చిన విచారము ? నా బంగరుకొండ నడిసముద్రమున నంతర్ధానమైనది. అందుల కించుక దుఃఖించితిని. తీరిపోయినది.

(అని చొక్కా నూడఁదీయుచుండ, తెరపడును.)



## తృతీయరంగము

[బయలుస్థలము: సమీపములో గుడిసె కనంబడుచుండును.
వెంకడు తూలుచు ప్రవేశించును.]

వెంకడు—యెదవనాయాళ్ళు. యెంకడుసంగటి హెరగరు. టాగటానికి యీళ్ళసేట్రి మాడ్డి? యెంకటాద్రివయ్య సల్లగుంటే యేలకేలు తాగేత్తాను. పొద్దాక కూలి సేసి పావలాడబ్బులు సంపాయిత్తే, ట్రాగుతే బువ్వనేదు, బువ్వుంటే టాగనేరు. యీళ్ళకా నాతో పోటీ? హా హా హా హా హా. కల్లుపాయి సేట పట్టానంటే కడవలు కడవలెగరాలిసిందే. సారాట్రాగితే డ్రాములు సాలవ్; సీసాలు సాలవ్. టస్సడియ్యా, యేకల్లు యెట్టుంట్టుందో, యే సారాలో యెంట నిసా వుంటుందో యీళ్ళమొకం యీళ్ళకేం టెలుసు? డ్రాం రమ్ముసారా టాగితే రొమ్ము టెండిపోయి పీనుగు లౌటారు. సేరు యిప్పసారా టాగితే సిత్తయిపోతారు. యీతకల్లు కమ్మగావుంటుంది. టాటికళ్ళు నిసాటక్కువ. పుల్లకల్లు యితే హూక్. భరాణి (బ్రాంది) టాగితే గొంటులో భగభగ మండిపోటమే. హాహాహా! యేంటాగటమో; టాగితే యీటకల్లు టాగాలి, యిప్పసారా టాగాలి. టాటికల్లు టల్లి. యీటకల్లు పెల్లాం. యిప్పసారా యింటిసవిటి. రమ్ముసారా డొమ్మరది. భరాణి (బ్రాంది) బోగంది. మంచి డేడంటారు? సమాదానం సాటకాక యెక్కిరిట్టారేం? యెక్కిడిచ్చినోళ్ళ బుఱ్ఱ లెగర కొట్టానంటే కల్లుసముద్రింలో టానమాడి రావాల్సిందే. బాపనోళ్ళబుఱ్ఱలు పిటక్కొట్టాలి. యెంట దూరంవుండా యింకా పొమ్మంటారు. మావొంటినలుప్పు ఆళ్ళ కంటుకుంటదేమో. యిండాక సారాకొట్టుకాడికి నాటో టాగటాని కొచ్చిన బాపనాయని గటేమైండీ? హాహాహాహా! లేకమోతే ఆడకూడ అంటే నంట్ట, టాగటం టప్పంట. జంజాలు బొడ్లో దోపుకొని టాగుటున్న భేంబర్లని రోజూ యెంటమండిని సూట్టుండాను! కాపీ టాగటానికి కల్లుటాగటానికీ టేడా యేంటి? అడిసౌఖ్యంకోసమే.

యిడీ సౌఖ్యంకోసమే. కాదంటారా? అన్నవోళ్ళు నాషుట్టూ బలాదూర్. లేకపోతే అబద్ధా లాట్టమెందుకూ? నిషావుంటే నిషావుండదనే షెప్పాల. అందుపేట భూంమీాన టాగనోళ్లే లేరు. (గుడిసెముందుకు పోయి) యీాటకల్లూ! యిట్రాంవే?

మల్లి—(ప్రవేశించి) యేం దొరా!

వెంక—యేం డొరా అంటావేం? యీాటకల్లు టాగావా? యిప్ప సారా టాగావా? యీాటకల్లు నువ్వు, యిప్పసారా నీసవిటి. టాగేవోణ్ణి నేను.

మల్లి—నాసాఁయీా! యీాతాగటవేంది? యీాతందనాలపదా లేంది? యీామాటఁ లేందీ? ఊఁ నా మాటినవ్గందా. యెన్నిమొత్తు కున్నా యినవ్గందా? నన్ను సొక్కిపెట్టవుగందా? యెన్నాళ్లీ గాచారం? యెదవ సారా తాక్కపోతే నేం?

వెంక—నంజా! యెదవసారా తాగానంటావా? యెదవషారా తాగి నాడు యెదవకన్న టక్కువోడన్నమాటేగా! యేందా పొగరు? టిట్టతానికి తెగపడ్డావేందే! యిప్పుడు మల్లీ తిట్టూ! ఊఁ ఊఁ, (అని చావగొట్టును.)

మల్లి—నేదు, సాఁయీా! నేదు. తిట్టనేదు. నే సచ్చిపోాత. కొట్టకు.

వెంక—తిట్టనేదా? తిట్టనేదా? (అని కొట్టుచుండును.)

[అంత వెంకట్రావు రాజారాములు ప్రవేశింతురు.]

వెంకట్రావు—ఆఁ ఆఁ వెంకడూ! యేమది దాన్ని కొట్టెదవేమి?

రాజారాం—త్రాగు డెక్కువయి. వెంకడూ! నీయంతు కనుక్కుంటా చూడు. నిన్ను పోలీసుల కప్పగించి ఖైదులో పెట్టించెదను. ఆ సుకుమారి నట్లు కొట్టెదవా?

మల్లి—యేందండీ, నాదేముణ్ణి జెయిల్లో పెట్టించటఁ వెందుకు? పోలీ సోరి కప్పగించటఁ వెందుకు? దొంగతనం సేసిండా?

రాజారాం—నీ సుకుమార శరీరమును బాధించినందుకు. నీ లేతనూ లతపై కొట్టినందుకు.

మల్లి—నోరు సంబాళించుకొని మాట్లాడండి. దొరగోరితో వొచ్చాను గెందా అనా? నన్ను వర్ణిత్తావెందుకు? నాదేవుడు నన్ను కొట్ట లేదు.

రాజారాం—అబద్ధ మెందుల కాడెదవు? నిన్ను కొట్టుట యిపుడు మేము చూడలేదా?

మల్లి—అసలు నీ కెందుకయ్యా? మే మాడుకొంటుండాం. మా ఆట లట్లాగే ఉంటై. మొగుడూపెళ్ళాంల ఆటల్లో యింకోరి కేంపని?

వెంకటాద్రి—రాజారాం! నీవూరకొనుము. వెంకడూ! త్వరగా భోజనము చేసి యింటికేగి జాగ్రతగానుండుము. (అని రాజారాం వెంక టాద్రివు లీవలికి వత్తురు)

(మల్లి వెంకడు నొకచోట జేరుదురు.)

రాజారాం—మిత్రమా! మల్లి-కాదు-మల్లిక మసిపాతను కట్టఁబడిన మాణిక్యముకదా?

వెంకటాద్రి—చాల గుణవతికూడను.

రాజారాం—అవు నవును. ఈవిషయమై యాలోచించి చెప్పెదను. గుణము? (అని నిష్క్రమించుచుందురు)

వెంక—నా మల్లా! నాపరువు కాపాడావు.

మల్లి—ఆడుకుంటుండమూట నిజమే ననుకుంటానికి కొత్త.........

వెంక—చరే, కానీ, యేదీ?

[అనుబంధము 1]

వెంకడు—చరేగాని, పిల్లా! తాణానికి నీలు కాగమెట్టేవా?

మల్లి—పెట్టనేదు పిల్లగా!

వెంక—వహ్వా, వహ్వా. మొన్నాల కినాల్చినమా టిన్నాను! మాఅమ్మ బతికున్నన్నాలు నన్ను "పిల్లగా" అని పిలుటాద్రివుండేది. అది నచ్చింది. పత్తోళ్లూ వోరెంకా వోరి ముసలోడా అనే పిలు ట్టారు! కాని ఆ అదురుట్టం ఇయ్యాల కల్గలిగింది.

మల్లి—యేంది కలి గేది? రోజూ పరాసికమే. యాభై యేళ్లొచ్చినయ్యి
గెందా? నూ పిల్లగాడివా నాను పిల్లనా?
వెంక—యాభై యేళ్ళొత్తే ముసలాణ్ణన్నమాటే?
మల్లి—కాక పడుసోడివా? యెంకటాద్రిపుగారు సాయితా చేశారు గెందా అని మా అయ్యొసచ్చినోడికి మూడొంద లిచ్చి నన్ను కట్టుకున్నావు. మూడేళ్లైంది యీమూడేళ్ళనుంచీగూడా ఆ యెంకటాద్రిపుగారే డబ్బిత్తుండారుగదా అని యిట్టమొచ్చినట్టు తాగటం, నా యెముకలన్నీ యిరగమొడవటం. యింత కాక మోతే ఒక్క రేత్తిరైనా యింటికాడున్నపాపానపోయావ్వా? నువ్వు ముసలోడివి నీపెళ్లాన్ని నేను యేళ్లు తక్కువైనా ముసల్దానికింద నెక్కెట్టాల్సిందే.
వెంక—యెందుకనీ? నూ సిన్నదానివి కామట్టి నేనుకూడా సిన్నోణ్ణే.
మల్లి—పడ్చుపిల్లకి పడుచుమొగుడైతే సుకంగా వుంటదిగాని ముసల మొగుడుకాడేం సుకం? ముసలపెళ్లామైనా యాడాది కోపాలైనా?.........
వెంక—యేంచెయ్యాల ఉద్దోగం......
మల్లి—యీడుకు మించిననని పెయ్యాలంటే కట్టం. యెప్పుడూ ఆరింటికాడ శాకిరేలయితే, నాగతేంకావాల?
వెంక—నీకేం బువ్వకు లోటైందా?
మల్లి—నారంగా! పెళ్లాడేది బువ్వకోసంవేనా? బువ్వొండిపెడతానికేనా? అందుకేలయితే పెళ్ళాలెందుకు మొగుళ్లెందుకు! ఆడోళ్ళకి శాకిరి చేసుకుంటే యింతబువ్వ దొరకదా? అట్లయితే ఆపనేం.
వెంక—గాశారం, యేంసెయ్యమంటవు? ఆరిమాట యినకమోతే బువ్వ దొరకదు. పొగలల్లా పొలంకాపలాకు, రేత్తిరెల్లా యింటికాపలాకు జీతంవిత్తుండాడాయన. యిప్పుడు సెప్పెళ్ళలా? పోకమోతే కోపమొత్తుద్ది. బువ్వెట్టు, పోవాల.
మల్లి—రా దేవుడా? రా? భగవంతుడు నాగతి యిలా రాశిండు.
(అని యిర్వురు నిష్క్రమింతురు)



# రంగూన్ మెయిల్

## ద్వితీయాంకము

### ప్రథమరంగము

[ సుశీల మోహనరావు శ్యామసుందర్ కూరుచుండియుందురు ]

సుశీల—జీవితేశ్వరా! కష్టసుఖములు మనకు శాశ్వతములా?

[అనుబంధము 2]

అయినను కాలవశమున గల్గినకష్టముల కెవ్వరు కర్తలు?

మోహ—సుశీలా! నీవు సార్థకనామధేయువు.

(అంత నొకజవాను రెండుకవర్లు నిచ్చి సంతకము చేయించుకొని పోవును)

మోహ—(కవర్లను విప్పి చదువుచు) దైవమా, కష్టములన్నియు నొక్క పరియే రావలయునా?

సుశీల—(ఆత్రముతో) నాథా! అదియేమి?

మోహ—ఇదియా, గోరుచుట్టుపై రోకంటిపోటు. ఉపకారముదలంచి యొకరికి జామీనుంటిని. అదియే నాకపకారమైనది. నా యేబది వేల ఋణము చాలక నిది యొక యిరువదివేలు నెత్తినపడినది. ఈ డెబ్బదివేలు రాబట్టుకొనుటకు బ్యాంకువారు తమకు తనఖాయందున్న నా యావదాస్తియు వేలము వేయించక మానరు. మిగిలిన ఋణస్థుల కాస్తి యేమియు లభింపక కక్ష దీర్చుకొనుటకై నన్నరెస్టు జేయించకమానరు. నా కింక కారాగారవాసము తప్పదు.

తే॥ గీ॥ కారఁబడి దుఃఖమున కడుఁ ♦ గనలి కుమిలి
జీవముల్ విడలేక వా♦పోవుకన్న
అంతగతి కల్గకుండనే ♦ చింతదీర
కాయమును బాయుటయె శుభం♦కరము గాదె?

(అని పుత్రుని దగ్గరకుఁదీసికొని) తండ్రి! నే నెంతటి దుర్మార్గుఁడను!

ఉ॥ ఆశకుఁ బోయి, యున్నధన ♦ మంతయు దగ్ధమొనర్చి భిక్షుకుం
జేసియు నిన్ను నే నిపుడు ♦ జీవముల౯ బెడబాయనుంటి నో
యీ సుకుమార! యీ జడున ♦ కేల జనించితివయ్య? దుఃఖవా
రాశిని ముగ్గనా చిరుత♦ప్రాయమునందె యదృష్టహీనత౯ ?

సుశీలా! యిదే కుఱ్ఱవాని నీ కప్పగించుచుంటిని. నీ తండ్రి యింటఁజేరి కుఱ్ఱవాని జాగ్రతగ కాపాడుకొనుము.

సుశీ—(చెవులు మూసికొని) అమంగళము ప్రతిహతమగుగాక. దేవా! యివి యేటిమాటలు?

[అనుబంధము ౬]

మీరే యిట్లు దుఃఖించిన నిఁక నబలనగు నా గతియేమి? ఇట్టి క్లిష్టపరిస్థితులయందు నాతండ్రి యేమేని సాయముచేయఁడా?

మోహ—దేవీ! అది యెన్నటికిని కానిపని. నీ తండ్రిని ధనమిమ్మని నేను కోరుదునా? ఇచ్చినను గ్రహింతునా? గ్రహింపనగునా?

సుశీ—ఎందువలన గ్రహింపఁగూడదు ? ఇందుఁ దప్పేమున్నది? పరుల నాశ్రయించుట లేదుకదా ? ఏకమాత్ర పుత్రికనైన నాకు కష్టము సంభవించినప్పుడు నాకొఱకై యాతడుఁ ద్రవ్యము వెచ్చించుటకు వెనుకంజవేయునా? నాథా! ఆలోచింపకుఁడు. లెండు. నా జనకు నడుగుఁడు. ఆయన తప్పక ద్రవ్యమొసఁగును.

మోహ—పిచ్చిదానా ! ఏల నను తొందరించెదవు? మామ నాశ్రయుంచుటకన్న నైచ్యమువేరుగనున్నదా? ఇంతటి హైన్యమునకు మనం బంగీకరించునా?

సుశీ—వలదు. మీ రాశ్రయింపవలదు. మీ యాజ్ఞయైన నే నడిగి ధనము తెత్తును. సరియా?

మోహ—నేనంగీకరింపను. ఇంతకన్న నేమిత్రునో యాశ్రయించి నేనే ధనముఁ దెచ్చెదను. ఏమిత్రుఁడో యననేల? నాబహిఃప్రాణమైన వెంకటాద్రియున్నాఁడు. రంగూన్ మెయిల్ కొట్టుకొని పోయిన దినముసఁగూడ నాకెంతయో సాయ మొనర్చినాఁడు. ఇపుడు మాత్రము సాయ మొనర్పకుండునా?

సుశీ—ఇది మంచిపనియా? సంసారము గుట్టుగ నుండవలదా? మన బందుగుఁడా? మనవంశజుఁడా? మిత్రులను నమ్మి మోసపోయిన వారల నెందరిని మనము చూచుటలేదు? ఎందరు మిత్రద్రోహు లీప్రపంచమున నెందర ధ్వంస మొనర్చుటలేదు? మీకుఁ జెప్పఁ గలదాననా? నాథా; నా మొరాలకింపుఁడు. ఇందులకు నాతండ్రి అన్యథా తలంపఁడు. ఈవార్త నెఱిఁగినచో మన మడుగకుండ గనే ధనము తెచ్చియిచ్చును. సందేహింపకుఁడు. ఇతరుల నాశ్రయింత మను యోచన మీ హృదయమునకు దూర మొనర్పుఁడు.

మోహ—(యోజించి తలనూపుచు) ప్రయోజనములేదు. ఇందులకు నేనంగీకరింపను. నీతండ్రి తనంత తెచ్చియిచ్చినను నా కక్కర లేదు. మైత్రిలో నెంతటి మహిమయున్నదో నీ వే మెఱుంగు దువు? కండువా తెచ్చియిమ్ము. మాటలతో కాదు. ఆతనికి నాపై నెంతవాత్సల్య మున్నదో క్రియారూపమున జూపెదను

సుశీ—(కన్నీరు నించుచు) నామాట వినరా? నావాక్యములు రిత్తలని యెంచుచుంటిరా? నామాటలపై విశ్వాసము లేదా? నాథా! నాథా! ఇందువలన మనకు చేటు మూడఁగలదు. ఇట్లంటినని నాపై కినియకుఁడు. మీప్రయత్నము మానుఁడు.

మోహ—ఈవిషయమున మాత్రము నీమాట వినను. (అని లోపలికి

పోయి కండువావైచుకొని ప్రవేశించుచు) లేనిపోని సంశయముల పెట్టుకొనకుము (అని పోవుచుండ)

శ్యాం—నాన్నా! నేను కూలా వొత్తా.

మోహ—బాబూ! నే నిపుడే వచ్చెదను. నీవు మీయమ్మయొద్ద నుండుము. (అని నిష్క్రమించును)

సుశీ—నాథా, నాథా. (అని కన్నీరు కార్చుచు నిలిచియుండును)



ద్వితీయ రంగము

(వెంకట్రావు యింటిముందు ప్రదేశము: రాజారా మొంటరిగ పచారులు చేయుచు)

రాజా—మల్లినామస్మరణ, కాదు కాదు, మల్లికానామస్మరణతోడ పొద్దులు పుచ్చుచున్నాను. ఆహా! యెంతటి యమూల్య రత్నము! అభ్యంగనాదుల జేయించి పరిశుభ్రమైన వస్త్రములం గట్టించి కురుల దువ్వి పూలు ముడిచి సువర్ణాభరణములతో నలంకరించినచో అప్సరస్త్రీలుకూడ మల్లి కాలిగోటికి సరిపోలరు. ఇన్నిహంగామాలు చేయుటకు ధనమేది? నా తండ్రియగు గంగారాంసేటు వడ్డీలకు వడ్డీలు పెంచి యార్జించి నాకొసంగిన ధన మంతయు నన్నివిధముల నీవరకే యనుభవించితిని. వెంకట్రావు దయవలన ధనములేనిలోపము కనుపడుటలేదు. వ్యయ ప్రయాస లాతనివి, యనుభవము నాది. సర్వస్వాతంత్ర్యముగ ననుభవించుచుంటిని గాని, యాతనిభార్యమాత్రము నాకు తావిచ్చుటలేదు. ఎన్నియో బొంకి యెన్నియాశలో కల్పించి తన తల్లిదండ్రుల మోసగించి, తనను ఈరెండవపెండ్లి వెంకట్రావున కిచ్చి బలవంతముగ సంటగట్టించితి నని శాంతకు నాపై కోపము. తాను తనపతియగు వెంకట్రావుతో నెన్నియో కొండెములుచెప్పుచున్నట్లు వింటిని. కాని, యాతడు మాత్రము నమ్ముచున్నట్లులేదు. నమ్మియేయున్న మామైత్రి కీవరకే స్వస్తి

చెప్పవలసి వచ్చియుండెడిది. నమ్మినను నన్నేమియు ననజాలడు. అన్నచో తన వ్యూహములు సాగవనుభయ మొకటి, వేశ్యలతోడి సరససల్లాపములు కరవగు ననుభయ మొకటి. ఇంతకును వెంకనిది యదృష్టము. దైవము నన్ను రాజారాంగా సృష్టించెనుకాని, వెంకనిగా సృష్టించియుండిన నెంత బాగుండెడిది? విశ్వామిత్రునకువలె నాకుఁగూడ ప్రతిసృష్టి చేయఁగల సామర్థ్యమున్నచో బ్రహ్మసృష్టినంతయు తారుమారు చేసియుందును. అందులకు చింతించి యేమి ప్రయోజనము? వెంకటాద్రివునకే తైలము బ్రామెదను, ఈతఁడెంతకును నింటినుండి బయటపడడే! (అని పచారులు చేయుచుండ)

[వెంకటాద్రివు ప్రవేశించును.]

రాజా—వెంకటాద్రివుగారూ! నమస్కారము.

వెంక—అరే! యెప్పుడువచ్చితివి? ఏవేళకును రాకపోతే నీకొరకే రావలయునని బయలు దేరితిని. ఇపుడు నీవలన నొక మహాత్కార్యము కావలసియున్నది.

రాజా—మీయాజ్ఞ కన్యథా యెప్పుడు చరించితిని. కాని నేను కూడ మీవలన కొంతసహాయ మపేక్షించుచుంటిని.

వెంక—ఏమది?

రాజా—నాకొక సంబంధము వచ్చినది. నేను వలదన్నను నాతల్లి ముండ పెండ్లిచేసికొమ్మని గోలపెట్టుచున్నది. కొలదిదినములలో ప్రధానము జరుపవలయును. ధనము లేదు.

వెంక—ఇంతేకదా! ఆధన మెంతకావలయునో అంతయునునేనిచ్చెదను. సరియా? ఇఁక నావిషయమై విచారింపకుము. మోహన్‌రావు స్థితి యెట్లు మారినదో యెరుగుదువుగదా? నేషనల్‌బ్యాంకు తనఖాబాకీ యేబదివేలకిృంద నాతనియాస్తి వేలము వేయించునట్లు యేర్పాట్లు జరిగినవి. (అని చెవిలో రహస్యము చెప్పి) ఇందుల కేదేని యుపాయ మాలోచింపవలయును.

రాజా—ఉపాయమున కేమున్నది? బాఁిది, సాంది; యీ రెంటితో లోబరచుకొనవచ్చును.

వెంక—పొరబడుచుంటివి. ఆతఁడు సద్గుణవంతుఁడు. ఆతనిభార్య సౌందర్యరాసి. ఆతని కామెపై ప్రేమ యధికము. ఆతఁ డిందుల కంగీకరింపఁడు.

రాజా—ఆతఁ డంగీకరించునా? కొంచెము శ్రమపడవలయును.

తే॥ గీ॥ ఎట్టులో యుక్తిచే బాఁిది ♦ నింత తాగఁ
జేసి, వేశ్యను జేర్చిన ♦ జీడివోలె
విడచునే యవి, యీతఁడ ♦ వీడనెంచి
యున్న? వాటికి లొంగని ♦ యువకుఁడెవఁడు?

విందొకటి ఏర్పరచి (రహస్యము చెప్పి) మెల్లగా వారిజయింటికి...

వెంక—నా యుంపుడుగత్తె!

రాజా—నీ వనుభవించుచుంటివా? అయినను లంజ కొక మగఁడేమిటి! అదిగాక మిత్రులలో ఆభేద ముండకూడదు. కార్యసాధనకొఱకు తప్పక యంగీకరింపవలయును.

వెంక—ఏమో! ఆభారమంతయు నీది.

రాజా—నీభారము నాది, నాభారము నీది (చెవిలో రహస్యముచెప్పి) ఇందుకు నీవు తోడ్పడవలయును.

వెంక—మల్లి లొంగునది కాదు. చాల గుణవతి.

రాజా—నీవుకూడ గుణవంతుఁడవే. దాంపత్యము విడదీయుటకు మాటసాయము జేయుము. తదుపరి నా ప్రజ్ఞ చూడుము.

వెంక—సరియే అందులకు నే నంగీకరించితిని. ఆవచ్చునది మోహన్‌రావువలె నున్నాఁడే!

రాజా—ఆహా, ఆతఁడే.

వెంక—(అయిదురూపాయీలనోటు నిచ్చి) నీవు బాజారునకుఁ బోయి రమ్ము. ఆతఁడు మన యింటికే వచ్చుచున్నాఁడు. (రాజారాం నిష్క్రమించును. వెంకటావుకూడ లోనికేగును),

మోహన్—(ప్రవేశించి తెరవైపు చూచుచు) వెంకటాద్రిపుగారూ! వెంకటాద్రిపుగారు! (అని కేకలు వైచి) ఇంటియందు లేనట్లున్నది. ఎచ్చటకు బోయెనో ఎట్లు తెలియును. ఎప్పటికి వత్తురో కార్యార్థిని కావున వేచియుండక తప్పదు.

వెంక—(ప్రవేశించి) మోహనరావుగారా! ఎంతసేపైనది వచ్చి? లోనికి పోవుదము రండు, (తెరనెత్తగా వెంకటాద్రి గృహము. ఇద్దరును లోనికి పోయి కూర్చుందురు)

వెంక—ఏమాత్రము తీరికయున్నను మీయింటికి వచ్చియుండెడివాఁడను. నాటినుండియు మరల మీ క్షేమము విచారించలేదు! ఏమి చేయుదును! మా బంధువులలో నొక కుఱ్ఱవానికి చాల జబ్బుగానున్నది. వచ్చెడి ప్రాణము; పోయెడి ప్రాణము. వచ్చిపోయెడి బంధుగుల కంతు లేదు. రేయింబవళ్ళు నిదుర లుండుటలేదు. నిమిషమున కొక డాక్టరును బిలిపించుచుంటిని!

మోహ—పాపము ఎట్లున్నది?

వెంక—ఎట్లున్నదని చెప్పుదును! ఇప్పుడే యింజక్షను నిప్పించి వచ్చితిని. కొంచెము నిలువఁబడినట్లు తోచుచున్నది. పాపము వాళ్ళకును వేరుసహాయము లేదు. బదతనము.

మోహ—వెంకటాద్రిపుగారూ! మీరింతటి యుదారహృదయులు కావుననే నేనుకూడ మీ సహాయ మపేక్షించి వచ్చితిని.

వెంక—ఆతనిస్థితి యెట్లున్నను, ముందు మీ సంగతి విచారించుట నాకు ముఖ్యము. మిత్రుడనని కదా ఇంత యభిమానముతో పరుగెత్తి వచ్చితిరి. మీకు వలసిన సాయము చేసెదను. చెప్పుడు.

మోహ—ఏమి చెప్పుదును? నాయేఁబదివేల ఋణమునకును నేషనల్ బ్యాంకువారు నోటీసు నిచ్చిరి; నాజామీనుపై నిరువదివేలు ఋణము గైకొనిన నారాయణరావు దివాలాతీసినాఁడట, అది కూడ నానెత్తిన పడినది.

వెంక—మోహనరావుగారూ! మీరు ధైర్యముతో నుండుఁడు. మిమ్ముల నీ విపత్తునుండి తప్పించు భారము నేను నెత్తిన వైచు

కొనెదను. ఇప్పు డీఋణము చెల్లించి యాస్తివిడుదల జేయించి నచో, యితర ఋణస్థు లెవ్వరైన ఆయాస్తిని వేలము వేయించి మీకు దక్కనీయరు. కావున బ్యాంకువారినే వేలము వేయ నిండు. నెత్తిన పడినతరువాత, ఆయిరువది వేలుమాత్రి మెట్లు తప్పును? వేలము డెబ్బదివేలకే మీయాస్తి నాపేర కొట్టి వేయించుకొనెదను. మీవ్యవహార మంతయు చక్కబడినతరు వాత మీయాస్తి మీపేర వ్రాసియిచ్చెదను. నాపేర పెట్టు కొనుటకన్నగూడ, నమ్మకమైనస్త్రీ యెవ్వరైన నున్నచో యామె పేర పెట్టుట యింకను బాగుండునట్లు దోచుచున్నది. మన మిర్వురము మిత్రులము గావున నిది లాలూచీయని యితరు లెవరును అనుమానించుటకుగూడ వీలుండదు.

మోహ—ఆ భారమంతయు మీది. నన్ను ముంచినను తేల్చినను మిమ్ములనే నమ్మియుండెద.

(అంత రాజారాం లైంజ్యూస్ బాటిల్సుతో
ప్రవేశించి బుడ్లు బల్లపై బెట్టును)

వెంక—దాని కేమిలెండు! అదంతయు నేఁజూచుకొందును. రాజారాం!
కూర్చుండుము. చూచితివా, దైవ మెంత పక్షపాతియో?

తే॥ గీ॥ కల ధనానికి తోడింక♦వలయుననుచు
కష్టపడి యేదియో యొక ♦ కార్యమందు
కాలుబెట్టుచు నార్జింప ♦ గడఁగువారి
యునికి గని యీశ్వరుం డది♦యోర్వలేఁడు.

మోహ—వెంకటా్రివుగారూ! "బుద్ధిః కర్మానుసారిణీ" యని కర్మనను సరించి బుద్ధులు పుట్టుచుండును. దీనికి భగవంతుఁ డేమిచేయ గలఁడు. విధివ్రాలు తప్పింప నెవరితరము.

రాజా—(నవ్వి) స్థితినిబట్టికూడ ధోరణి మారుచుండుట సహజము.

వెంక—రాజారాం! ఇపుడు హాస్యమునకు సమయముకాదు.

మోహ—నన్ను పరిహసించుటయేమి? ప్రతిమానవుని జీవితమును హాస్యాస్పదమే. అందు నాస్థితి మరీహీనము. ఏమందురా?

మ॥ ధనవంతుం డగు నేని హీనుఁడును చెంతన్ జేరుచున్, రేబవల్
జనులెంతో నుతిసేతు రెంకొకడు సచ్చారిత్రుఁడౌగాక, యా
ఘనునిం జూడరు జేరబో రతని నాకాంక్షింప రెవ్వారలున్
ధనమూలంబులు గౌరవోన్నతులు గాదా, చూడ నిద్ధాత్రిలోన్.

వెంక—ఆతని మాటలు లెక్కసేయకుఁడు. ఫలహారముల దెత్తు నుండుఁడు.

మోహన్—అనవసరముగ నేమేమియో తెప్పించితిరి.

వెంక—అనవసర మేమున్నది? మన మేమిశాశ్వతమా? ఇపుడు గాకున్న నిఁక ననుభవించున దెప్పుడు?

మోహన్—అవును. ఆమాటయు నిజమే.

చ॥ కలిమి గలట్టివారు, కల కాలము నిల్చెడుభంగి, యార్జనన్
సలుపుచు, లోభులై, తినఁగఁ జాలక కట్టగలేక, యెంతయున్
వెలయుదు, రంత్యకాలమున వెంటనె వచ్చునె, యాధనంబు, దొంగలో, దొరలో భుజింతు రటు గాక, రహించునె నీచసంపదల్.

శాంత—(లోపలనుండియే) ఏమిచేయుచున్నారు? ఒకపరి లోనికి వచ్చెదరా?

వెంక—ఏమి కొంపమునిగినది, పెద్దమనుష్యులతో మాటలాడుచుండ...

మోహ—పరవాలేదు. ఎందులకో పోయిరండు.

(వెంకటాద్రిపు నిష్క్రమించును)

రాజా—(తనలో) ఈ కటకట యంతయు కంఠస్వరము పరులు వినిరని కాఁబోలు. ఇది పిచ్చియూహ. స్త్రీకి మనశ్చాంచల్యము పుట్టనంతవరకే పురుషునియాటలుగాని, పుట్టినచో చీకటికొట్టులో బంధించినను, శృంఖలములం దెంచుకొనిన మదపుటేనుఁగువలె బందెనుండి యీవలబడి విచ్చలవిడిగ సంచరింపదా? ఇంత కట్టడిలో నుంచుటగూడ కొంతసాహసించుటకు కారణమగును.

(వెంకటాద్రివరు దెంచి కూర్చుండును. మూడు ప్లేట్లతో సేవకుడు ఫలహారములు తెచ్చి బల్లపైనుంచి నిష్క్రమించును )

వెంక—ఫలహారములు కానిండు; ఆలోచించెద రేమలకు? మైత్రి బంధుత్వముకన్న నెక్కువది. మిత్రులయం దే భేదములును నుండకూడదు.

మోహన్—భేద మే మున్నది.

(అని మువ్వురును ఫలహారములు చేయుచుందురు)

శాంత—(ప్రవేశించి సైడులోనుండియే) ఆహా! యీ నవమోహనుని జూచి యెంతకాలమైనది. నానాటికిని ఈతని సౌందర్య మభివృద్ధి నందుచున్న దే !

వెంక—మోహన్ రావుగారూ! ఎట్లున్నవి ఫలహారములు ?

మోహ—(నవ్వి) బాగుగనే యున్నవి.

శాంత—(తనలో) ఇంతటి సౌందర్యరాశితోడి సుఖమేక దా సుఖ మనం బడును.

వెంక—సేవకా ! లైంజ్యూస్ బాటిల్సు కొట్టి గ్లాసులలో పోయుము.

(సేవకుఁడు వచ్చి లైంజ్యూబాటిల్సు కొట్టి గ్లాసులలోపోసి నిష్క్ర॥)

వెంక—స్వీకరింపుడు. (ముప్వురును త్రాగుదురు)

మోహన్—వాసన వేరుగనున్నది. గొంతులో నేమోభగ్గున మండినది.

వెంక—ఇది యీనడుమనే క్రొత్తగా వచ్చినది. లైంజ్యూస్ త్రాగి నంతమాత్రముననే మనసున కతియుల్లాసమును గూర్చును.

మోహన్—అందువలననే కాఁబోలు శరీర ముప్పొంగుచున్నది.

రాజా—వెంకటాద్రిపుగారూ! ఇంతవరకేనా ? భోజనముకూడనా ?

వెంక—మోహన్ రావుగా రంగీకరించినచో,

మోహ—అందు తప్పేమున్నది ? "అన్నం పరబ్రహ్మస్వరూపం" (అని గొంతు సర్దుకొనును.)

వెంక—అదే మట్లు గొంతు సర్దుకొనుచున్నారు ?

మోహ—కొంచం...తల... తిరుతున్నట్టుంది.......గొంతు......

వెంక—కొంచెము సేపు పరుండెదరా ?

మోహ— అక్కర్లేదు......కొంచం...కాదు...కళ్ళు ... జిగుజిగు లాడుతున్నై . ఈ యిల్లు...వొకటారెండా...సినిమాలో ...వున్నట్టుగావుంది ..నక్షుట్రకుడుకి ... రావణాసురుడికి... పుష్కరుడి సభలో...ఫోటాట్టపడి... చెంచులక్ష్మిమీద పడ బోతే...సిట్రరేఖవొచ్చి ..అడ్డం టగులుటోంది...హాహా హాహాహ-యమదర్మరాజును...స్వర్గంలోంచి...డొర్లించింది... రంగసాని...హాహాహ...నేనైతే...కాల్చిపారేటును...అరెరె రెరెరె రేరేరే ..వషిష్టుడు...డమయంటిని...జుట్టుపట్టి కొని... యీడ్చుకొస్తున్నాడు.. నేనుపోయి...దేవేంద్రుడు . అహల్యను కాపాడినట్టు...పంపేస్తాను ... (అని లేచి తూలిపడుచూ) హాహాహాహా కాదుకాదు ... హాహాహ...కాదు...టారని ... హారిష్చంద్రుడు...యీడ్చుకొపోటున్నాడు ... పటివ్రటని... బలాట్కరిస్తే నాకేం... (అని కూలబడి పరుండును)

రాజా—వావాకులు కావలయునేమో?

వెంక—తెలివి వచ్చినపిదప నతఁడే పోవును. ఏమాత్రము పట్టించితి వేమిటి?

రాజా—రెండేసి డ్రాములు.

వెంక—అందుకనే యింతత్వరితముగ పనిజేసినది. ప్లాను కొంతవరకు కొనసాగినట్లే. రాజారాం! భోజనముచేసిరమ్ము. ఇంతలో నేను కూడ భుజించెదను.

రాజా—అట్లే కాని నామాటమాత్రము మరువకుఁడు. (అని నిష్క్రమించును)

శాంత—(కొంచెమాగి ప్రవేశించి చూసి) ఆహా! యెంతద్రోహము! తాఁజెడ్డకోతి వనమంతయు చెరచెనన్నట్లు నా భర్తా యీ నవ మన్మథాకారు మోసకృత్యమున తాగించి యింతటి దుస్థితికి

తెచ్చెనే! ఛీఛీ! మిత్రద్రోహ మొనర్చుటయా! ఈ దుష్టునకు మున్ముం దెట్టి దుర్గతి సంభవింపనున్నదో కదా! వెంకటావ్రా! నీదురూహాలే నిను నాశన మొనర్చును. పాపము సద్వంశసంజాతుఁడు సర్వాంగసుందరుఁడు సచ్ఛీలుఁడు ప్రేమమూర్తి (అని తలపంకించి ప్రేమదృక్కుల ప్రసరించుచు నిష్క్రమించును)

---

## తృతీయ రంగము.

[బయలుస్థలము. వెంకనిగుడిసె సమీపమున]

వెంకడు—(తూలుచు ప్రవేశించి) ట్రింటాను, ఫొడుస్ట్రాను, షంపేస్ట్రాను, యెవడిబాబుషొమ్ము ట్రాగేను. యెవడిట్రాటషొమ్ము ట్రాగేను. డ్రాంగటనంషేషి ట్రాగేనా? టొంక లెగరకొట్టి ట్రాగేనా? నాషొమ్ము నేను ట్రాగేను. యెంకట్రావయ్య షొమ్ము ట్రాగేను. ఆయనషొమ్మే నాషొమ్ము. రోజుకాడి కియ్యా ళెక్కువ ట్రాగేను. మీరు ట్రాగ్గలార, ట్రాగుశే షై? ఇయ్యా ళన్నిరుషులూ నూపించింద్రు మాడొర. అంత డబ్బిచ్చింద్రు. కాదంటారా? అన్నవోళ్ళ నెగిరిటంట్రాను. (అని తన్నబోయి క్రిందపడి) బలే పట్టీ, పట్ట్రీలు కొశ్రేనంశే నేనే కొట్రాలి. మొదలుకాడా పైలుమానోళ్ళకు పట్టీలు నేర్పిండి నేను. గుడ్లు మిట్రికరించి షూట్టారేం? యిగిలిట్టే, యీటకల్లు ట్రాగినట్టే, పడాలు పాట్రానికి మీషేశ్రి మాడ్డి. యెడవపడాలన్నీ యెందుర్కు? నేపాట్రానినండి.

పాట.

ట్రాగినోళ్ళషోకు ట్రాగిశేనె ట్రొలుష్టాడి,
ట్రాగనోళ్ళ కేంటెలుసు ట్రాటికళ్ళులోని మజా
యీరబడుద్రు ట్రాగి యిగ్గిణేషు డయ్యాడు
యిష్టామిటుద్రు ట్రాగి యింద్రు డైపోయాడు

యీటకళ్ళు తాగినోళ్లు యీరుస్వైపోటారు
తాటికళ్ళు తాగినోళ్ళు భెమ్మలోకం యెల్తారు
యిప్పసారా తాగినోళ్ళు యీంద్రసొర్గ మెల్తారు
రమ్ముసారా తాగినోళ్లు రంబకాడి కెల్తారు
షముద్రాలు కాలువలు సారాకళ్ళు కావాల
గుట్టలు రాళ్ళన్ని సీకుముక్కలు కావాల.
యీ షేట్టో సారా, యీ షేట్టో సీకులు పట్టుకుంటే సొర్గంలో
రంబతో మరసా లాడొచ్చు. యేమంటారు. కాదంటారా?
అంటేరి నాషట్టూ బలాదూర్.

మల్లి—(ప్రవేశించి) నాదేవు డాలగుందే [అని దగ్గరజేరి] యేంది
సాఁయీ! వోరితోటావోదన?

యెంక—యేండి పిల్లా! నీటోటే.

మల్లి—అదుగో యెప్పుడన్నా కోప వొచ్చేట్టే?

యెంక—ఆఁ కోపంలో పణయంకూడా వుంటేరి.

మల్లి—పణయం యింకోపదేళ్ళు పోయాక...నా సాయీఁ నామడు
సులో నే నెంత కుళ్ళిపోతుండానో నీ కేం తెలుసు? పపంచికం
మీన యెంతమంది ఒకమొగులు సాలక, శలరేగుతుండారు?
ముసలోళ్ళకు కట్టిమెడితే ఆగనేక యెంతమంది దొంగేదుపు
లేదుత్తుండారు. యెంతమంది లెగిచిమోతుండారు, ఆళ్ళనాగే
నానుకూడా దొంగేదుపు లేదుత్తావుంటే అనుకోవొచ్చు,
యెన్నాలకైనా నువ్వే నాదేవుడని, నీకాడే నాకు సుకం కలగా
లని, గంగాణమ్మకు మొక్కుంటుండా! దొంగేదు పేడిత్తే
వోరికి తెలేకపోయినా, బగమంతుడికి తెలీకపోదనుకుంటుండా!
యెన్నాలకైనా నామీన నీకే దయకలుగుద్దనుకుంటుండా!
అరుందతమ్మాం తంశనుబగించా లనుకుంటుండా?

యెంక—నామల్లీ! నీషంగటి నాకు టెలుషు, కైపు దిగినకొద్దీ
కూంట కూంట వొల్లు గరొడుత్తోంది, యేదీ, ఒక్కమాలి

పణయలోకంలో ముసుగుదాం ఒక్కముద్దెట్టు (అని కౌగ లించుకొని ముద్దిడబోవుచుండ వెంకటాద్రివు రాజారాంలు ప్రవేశము)

వెంకటాద్రి—ఒరే వెంకడూ! కొట్టకు కొట్టకు.

మల్లి—(సిగ్గుపడి తలవంచి దూరముగాఁ బోవును)

వెంక—కొట్టిటంనేదు బాబూ ?

రాజా—ఆహా ఆ వెన్నెలలో వనలక్ష్మివలె నున్నదినుమా ? వెంకడూ ! యేమిరా నీయదృష్టము !

వెంక—త. త. త. తమబో టాద్రిరలా...

రాజా—యింతమాత్రమునకేనా! మొన్నరాత్రి జరిగిన సమాచారమే విన్నచో నేమందువో ?

వెంక—యేందిదొరా ! యేందది సెప్పండి.

రాజా—మీయయ్యగారినే యడుగుము.

వెంక—సెప్పండి బాబూ! సెప్పండి. ఆమా టెన్నకాణ్ణుంచీ నావొంటి మీాన సీమలు పాకుతుండై.

వెంకటాద్రి—ఏమియునులేదు. నీ వెప్పుడును యింటివద్ద నుండవు. అది సిన్నపిల్ల.

వెంక—అయితే? సెప్పండి దొరా! నన్ను పంపకండి.

రాజా—అయితే యేమున్నది, యింకొకరితో......

వెంకటాద్రి—పోనిద్దూ, మొగుడూలేక సరసుడూలేక......

వెంక—ఆఁ అంతేనా ! నే నూరకుంటానా? యే! యిటా్రి.

మల్లి—యేందీ ?

వెంక—(కోపముతో) యేందంటా వేందే? రంకుమొగుణ్ణుంచొకొనే యిన్ని యేసాలూ. (అని జుట్టు పట్టుకొనును.)

మల్లి—ఇదేంది, నే నేపాపం యెరగను సాఁయేఁ.

వెంక—యెరగవూ యెరగవూ. (అని వొంగదీసి గుద్దుచూ)



రాజారాము మల్లికి ధనముసంచి ఆశజూపి లోబరచుకొనబోవుట, ఆమె నిరాకరించుట,

రాజారాము వెంకట్రావులు వెంకనికి మల్లిపై కొండెములుజెప్పి దానిని కొట్టించుట.

వారిద్దరి సంసారమ్ము విడదీయుట.

వెంకటా్రి—కొట్టకు కొట్టకు.

వెంక—పో నంజా! పో! నాయింటికా డుండొద్దు పో! (అని కొట్టుచు గెంటుకొనిపోవును.)

వెంకటా్రి—ఎంతపని చేసితివోయి!

వెంక—బాబూ! యింటికి పోతా?

వెంకటా్రి—యిదిగో యీరెండురూప్యములను తీసికొని తా్రిగుము.

వెంక—సిత్తం బాబూ! (అని గుడిసెతలుపుకు తాళమువైచి నిష్క్రమించును.)

రాజా—మిత్రమా! చూచితివా?

వెంక—అప్పుడే యేమైనది?

రాజా—చూతువుగదా? వెంకనిమాత్రము దీనికడ జేరనీయకుండ తా్రిగుడునకు పుష్కలముగ ధన మొసంగుచు మల్లిపై కొండెములు చెప్పుచు దానిమాటయే మరచునట్లు చేయవలయును.

వెంక—అట్లే చేయుదము, పోవుదము పద.



# రంగూ౯ మెయిల్

## తృతీయాంకము

### ప్రథమరంగము

(మోహనరావు గృహము: మోహనరావు, కృష్ణమూర్తి కూర్చొని యుందురు)

కృష్ణ—మోహనా! అట్లనుకొనుటకు వీలులేదు. సంపదలతో దుల తూగునపుడే సర్వమిత్రులును సరసజేరుదురుగాని దరిద్రావస్థయం దెవ్వరును తోడ్పడరు. చూడు.

తే. గీ. స్వస్థలంబుల వెల్గొందు ♦ సమయమందె
నాదృతిం గందు రెల్ల రీ♦యవనియందు;
పద్మినీబాంధవుండైన ♦ భానుఁ డదరి
అంబుజము నొంపఁడే తటా♦కంబు విడిన.

మోహ౯—అదియు నిజమే! కాదనుట లేదు. కాని వెంకట్రావు విషయమున మాత్ర మట్లూహించుటకు వీలులేదు. రంగూ౯ మెయిల్ సముద్రమున నంతర్ధానమైననా డెంతసహాయపడెను? తదుపరి యెన్నియుపకారము లొనర్చెను? నా విషయమై మీకన్నగూడ నెక్కువ తాపత్రయపడుచుండెను. అట్టివాఁ డిఁకముందు మాత్రము సహాయపడకుండునని యూహించుట కవకాశమేది?

కృష్ణ—ఇది పిచ్చియూహ, వెంకట్రావుసంగతి నే నెరుఁగనా? ఆతని తండ్రి నెరుఁగనా? వెంకట్రావునకు ప్రాణమిత్రుఁడు రాజారాం. ఆతఁ డెవరు? గంగారాంసేట్ పుత్రుఁడు, త్రాగుబోతు, వ్యభి

చారి, దొంగ. అట్టివానికి మిత్రుఁడైన వెంకటావ్ సద్గుణ వంతుఁడెట్లగును? పచ్చికుక్కవలె చూచిన కాంతలనెల్ల నాసించు నాతఁడా, సద్భావమున సహాయమొనర్చును? ఇది కల్ల. ఈస్నేహ మెప్పటికైన ప్రమాదము తేకమానదు. అట్టిస్నేహ మప్రతిష్ఠ తెచ్చితీరును.

ఉ. చోరులు జారులున్ మరియు ♦ జూదరులున్ కడు మోసగాండ్రునున్
వారుణి గ్రోలువారి చెలు♦వంబున నబ్బవె యీగుణంబు లె
వ్వారికినైన కాక యప♦వాదము తప్పునె లోకమందు తా
చేరుటచేతనే శిఖియుఁ ♦ జెందడె సమ్మెటపెట్ల నిన్ముతోన్.

మోహన్—వెంకటావ్రు మీ రనుకొనునంతటి త్రాగుబోతుకాఁడు; అయినను ఆతనియందు నాకుఁగల విశ్వాసముచేత మీ వాక్యములు నాకు నచ్చుటలేదు. ఇందుకు మీ రాగ్రహింపకుందురని నా ప్రార్థన.

కృష్ణ—పోనిమ్ము! నీ కాతని నాశ్రయింపవలసినంత యగత్య మేమి వచ్చినది? నీ కెంతధనము కావలయునన్న నే నీయనా? నాకుమాత్రము వేరు సంతతియేది? నా తదనంతరము నా యాస్తికిగూడ మీ సతీపతులేకదా యుత్తరవాదు లగుదురు. నే నేమి కట్టుకొనిపోవుదునా?

మోహన్—మామగారూ! మీ యాస్తికొరకు నే నీమహాత్మ్రము నాశించుటలేదు. భార్యా బాంధవ్యమున జీవించుటకు నే నేమి పౌరుషహీనుఁడనా? శంకరరావుగారిపుత్రుఁడు పౌరుషహీనుఁ డెట్లగును?

కృష్ణ—అదిగో, అదియే నే నేడ్చునదియునూ; నీవుకూడ అట్టిస్థితికే వత్తువేమో యనియే నా ప్రాకులాట.

మోహన్—పౌరుషమున కంటెనిగాని యట్టిమరభ్యాసములనుమాత్రము నే నలవరచుకొనను. ఆ విషయమున ధైర్యముగ నుండవచ్చును.

కృష్ణ—ఏమో! ఏవేళ కెట్టిబుద్ధి జనించునో? అయినను నామాటలు నీ కిపుడు నచ్చవు! ఏమందువా?

చ. పడుచుదనంపుగర్వమున ♦ భావిదలంపక మూఢుఁడెంతయున్
చెడుసహవాసముల్ సలిపి ♦ చేటొనగూడెడునంతదాక తా
నుడుగఁడు వారిచెల్మి మది♦నోర్వఁడు పెద్దలుగూర్పుబుద్ధులన్
వడను సహించుపద్మము ల♦వంబును మెచ్చునె చంద్రికాంతులన్.

మోహ—అయితే మీయభిప్రాయము నే చెడుదు ననియేనా? సరి అట్లే తలంచుడు. అంతటిచేటు మూడి నేను మిమ్మాశ్రయించి నప్పుడే మీరాదరించుటయో, నిరాదరించుటయో యొనర్పఁ గూడదా? ఇప్పుడింతటికంఠశోష యెందులకు?

కృష్ణ—నాది కంఠశోషయా? కాదు. విశేషానుభవమున చెప్పుమాట లివి. నాగర్భవాసము; నాముద్దుబిడ్డ; నాయేకమాత్రపుత్రిక బాగుకొరకు నా మురిపెంపుమనుమని క్షేమముకొరకు ఆబాల్యం బుగ నతిగారాబమున నత్యంతప్రేమతో పెంచిన నీబాగు కొరకు చెప్పుచుంటిని.

సుశీల—(ప్రవేశించి) తండ్రీ! యిపుడు కాదనినవా రెవరు? కొన్ని దినములవరకును వారియుద్దేశ్యమునే యనుసరింపరాదా?

కృష్ణ—అమ్మా! నీవుకూడ నాతనియుద్దేశ్యమునే యనుసరించితివా? నీమగనియుద్దేశ్యము ననుసరింపలేక కాదు. చూచుచు నూరకుండలేక కాదు. ఈ వర కనుభవమున నున్న విషయమగుటచేత, భవిష్యత్తు నెరింగియుండుటచేత నాయనుంగుసోదరి యన్న పూర్ణ బలవన్మరణము క్షణక్షణము నాకు స్మృతికి వచ్చి నాగుండె ప్రేల్చుచుండుటచేత శంకరరావుస్థితి కనులార చూచి యుండుటచేత మీయోగక్షేమములు విచారించవలసిన బాధ్యత యుండుటచేత చెప్పవలసి వచ్చినది. కానిండు! మిమ్మేలకాదన వలయును? ఎట్లు కావలయునో అట్లు కాకమానదు. విధివ్రాలు తప్పింప నెవరితరము!

తే. గీ. ఎవరికర్మములకు కర్త ♦ లెవరు; తెలియ
గలరె, విధివిధానమ దెట్లుం ♦ కలదొ; జరుగ
వలసిన దవశ్యము జరుగ ♦ వలయు; ధాత
వ్రాత మాన్ప మగుడ ధాతచేత కాదు.

తల్లీ! నాకు కొంచెము తొందరపని యున్నది. పోయివచ్చె
దను. మోహనా! యిట్లంటినని నాపై గినియకుము.

(అని నిష్క్రమించును).

మోహ—నీతండ్రిగారికి నాపై సంతుష్టినియాగ్రహము కలిగినట్లు
న్నది ఆయనయపోహయేగాని...... (అని తలపట్టుకొనును).

సుశీల—వృద్ధులు. అతిప్రీతి శంకావహముగదా! అదేమట్లుతలపట్టుకొను
చున్నారు?

మోహ—మధ్యాహ్నమునుండియు అమితమైన తలనొప్పిగనున్నది.
అందువలననే యెన్నడు నెనురాడని మీతండ్రిగారికి విసివి
యట్టి ప్రత్యుత్తరము లిచ్చితిని.

సుశీల—పోనిం డిప్పు డది యెందులకు? కాఫీ త్రాగిన తలనొప్పి తగ్గు
నేమో! కాచియిత్తునా?

మోహ—ఆప్రియత్నముకూడ చేసిచూతము, కానిమ్ము.

(సుశీల లోనికిఁబోవును)

మోహ—అబ్బబ్బా! యెంతబాధగనున్నది! బాధనంతయు వెలిబుచ్చి
నచో పాపము! సర్వ సద్గుణ శీలయగు సుశీల నాకన్న నిబ్బడి
బాధ ననుభవించునని యెంచి యోర్చుకొనుటయేకాని భరిం
చుట కశక్యముగ నున్నది. నిన్నటి పానీయములో బ్రాంది
కలిసినట్లున్నది. లేకున్న నీతలనొప్పికి కారణ మగపడుటలేదు.

(అంత వెంకటా్రవు రాజారాములు ప్రవేశింతురు)

మోహ—ఓహో! దయచేయుఁడు. చాలదూర మరుదెంచితిరి.

వెంక—దూర మేమున్నది? చూచిపోవుటకు వచ్చితిమి. మీ రట్లు
నీరసముగ మాటలాడు చుంటిరేమి?

మోహ—మధ్యాహ్నమునుండియు భరింపజాలని శిరోబాధ.
సుశీ—(కాఫీతో ప్రవేశించి చూచి వెనుకకు తగ్గును.)
మోహన్—(చూచి) మన మిత్రులే. ఇటు తెమ్ము.
(సుశీల కాఫీకప్పు మోహనునిచేతి కందిచ్చును.)
రాజారాం—(తనలో) ఆహా! యేమి యీమె సౌందర్యము!
మోహన్—వెంకట్రావుగారికి కూడ......
వెంక—వలదు, నేనిపుడే త్రాగివచ్చితిని.
మోహన్—రాజారాం! నీకో?
రాజా—నేనును త్రాగివచ్చితిని కాని వలదనుట నామతము కాదు.
మోహ—సుశీ! ఇంకొకకప్పుతో తెచ్చియిమ్ము. (అని కాఫీ త్రాగును)
(సుశీల నిష్క్రమించును)
రాజా—(తనలో) ఆమెహస్తముతో నొసంగిన కాఫియైన త్రాగెదను.
(సుశీల కాఫీకప్పుతో ప్రవేశించి భర్తచేతి కందించి నిష్క్రమించును.)
మోహన్—రాజారాం! ఇదిగో, తీసికొనుము (అని యిచ్చును)
రాజా—(తీసికొని త్రాగుచు తనలో) తానే స్వయముగ నాచేతి కందించు ననుకొంటిని.
మోహన్—అబ్బా! కాఫీ త్రాగినను తలనొప్పి తగ్గలేదు.
వెంక—మోహన్‌రావుగారూ! దీనికి తగినమందు నిన్నటిపానీయమే.
మోహ—అందువలననే యింతబాధ సంభవించినదేమో యని నా యూహ.
వెంక—పిచ్చిమాట, దాని మాహాత్మ్యము మీరెరుగరు.

తే. గీ. సర్వరోగంబుల నడంపఁ ♦ జాలుమందు
చాల యుల్లాసమునుగూర్పఁ ♦ జాలుమందు
సకలజనులును సేవింపఁ ♦ జాలుమందు
సాటిలేనట్టిమందు ము♦జ్జగములందు.

మోహ—దానియం దంతటి మాహాత్మ్య మున్నదా?



మోహనరావును చూచుటకై యరుదెంచిన వెంకటాద్రివు రాజారాములకు మోహనరావు కాఫీ నిప్పించుట.
రాజారాం సుశీలను జూచి కనుగీటుట.

వెంక—దానికి సమాధాన మదియే యిచ్చును. నే తెప్పించియిచ్చెదను రండు

మోహ—సుశీ! కండువా తెచ్చియిమ్ము.

సుశీ—(కండువాతో ప్రవేశించి) ఇదిగో కండువా. (అని యిచ్చును)

రాజా—(తనలో) ఆపలికిన దీ కలికియా కోకిలయా!

మోహ—పోవుదమా?

వెంక—రండు.

రాజా—(వెనుకనడచుచు తనలో) నేటికి తుదిచూపు. (అని సుశీల వైపుచూచి కనుగీటును.)

(ముగ్గురును నిష్క్రమింతురు.)

సుశీ—హాహా! అదియాతనినైజగుణమైయుండును. అయినను వీరిచర్య లన్నియు ననుమానాస్పదముగనే యున్నవి. ఆహా! నానాథునకు మంచినేస్తములభించినది. నాజనకుని వాక్యములన్నియు సత్యములే యగునట్లున్నవి. ఎంతటి మిత్రుండైన ప్రతిఫల మపేక్షింపకుండ నింతధనము వ్యయమొనర్చునా? నేషనల్ బ్యాంకు వారు వేలము వేయనున్న యాస్తి తానే, తనపేరనే కొని, తుదకప్పగింతునని చెప్పెనట. ఎన్నివిధములనో యోదార్చెనట. విందొనర్చెనట. ఆవిందునం దేదియో పానీయము త్రాగినట్లు వీరి సంభాషణనుబట్టి తేలుచున్నది. అది సర్వవ్యాధులకును పరమౌషధమంట. అది త్రాగిననేగాని తలబాధ శమింపదట. అదియేమైయుండును? ఇంకేమైయుండును? ఆపానీయమే బ్రాందియై యుండును. ఆబ్రాంది త్రాగుటవలననే శిరోబాధయంకురించియుండును. అందువలననే, మరల నదియే త్రాగినగాని తలనొప్పి తగ్గదని చెప్పియుండును. హా! యింకేమున్నది? నానాథుండ ికఁ, మధుపానాసక్తుఁడై, వేశ్యాలంపటుఁడై, తండ్రిగారగు శంకరరావుగారిని మరపించునుకాఁబోలు. దైవమా! నావల్లభున కీ దుస్సాంగత్య మెచ్చటనుండి తెచ్చిపెట్టితివి? ఎట్టివానినెట్లు మార్పదలచుచుంటివి?

తే. గీ. తలఁప, పరహస్తదత్తని♦ర్మలజలంబుఁ
దాగివ వెరచెడు మన్నాథు ♦ నీవిధాన
నసురుగా మార్చివై చెడు♦నట్టి సురను
గోలఁ బాల్పడఁ జేసితే ♦ గోపబాల!

సాంగత్యమేకదా యిట్టి దురభ్యాసము లలవడజేయునది. దైవమా! మేమీవిధముగ జీవించుటకైయెన నిచ్ఛగింపవా?

అనుబంధము 5

(లోపల "అమ్మా, అమ్మా" యని కేకలు)

సుశీల—తండ్రీ! లేచితివా? యిదే వచ్చుచుంటిని. (అని నిష్క్ర మించును.)

---

## ద్వితీయ రంగము

[వారిజ యను వేశ్యగృహము: వెంకట్రావు, మోహనరావు, రాజారాం కూర్చుని యుందురు.]

వెంక—మోహనరావుగారూ! ఎట్లున్నది తలనొప్పి?

మోహన్—ఇఁక నెక్కడితలనొప్పి!

తే. గీ. వేయిశూలాలఁ బొడిచిన ♦ విధముదోఁప
విశ్రమింపఁగ నిదురింప ♦ వీలుగాక
బాధ పెట్టెడి నాశిరో♦వ్యాధిమాన్పి;
హాయి గలిగించె నెంతో, పా♦నీయ మకార!

వెంక—అదియే అందులోనున్న మజా.

మోహ—ఇది బ్రాందియందలి యాధిక్యముకాదు. మీ కృపావిశేషము.

వెంక—అంతటి ఘనత నాకొసంగుచుంటిరా?

మోహ—అట్లందురేమి?

సీ. బ్యాంకు వేలముపాటఁ ♦ బడనున్న నాయాస్తి
గొని నాకొసంగనుంట ♦ గొప్పగాదె
యింటికిఁ గొనిపోయి ♦ యెంతయు నోదార్చి
విందులఁ దేల్చుట ♦ వింతగాదె
పనులన్ని విడి వచ్చి ♦ బాధలందెడు నన్ను
గని ద్రవ్యమిచ్చుట ♦ ఘనతగాదె?
ధనమేమి ప్రాణంబుఁ ♦ గొను మొసంగెద నంచు
బలుకుట యిఁటు భాగ్య ♦ కలన గాదె
తే. గీ. రెండురీతుల మేను లి♦ట్లుండియున్న
బాధ లన్నియు నీతల♦పైనిఁ దాల్చు
యెలమిఁ గూర్చితి సినుఁబోలు ♦ హితుఁడు గలఁడె
మైత్రినిఁ మించు సుకృతంబు ♦ మహినిఁగలదె.

వెంక — మరచితిని రాజారాం! మనము త్వరగా నచటికి పోయిరా వలయునుగదా. మోహనరావుగారూ! మే మిప్పుడే వచ్చెదము.

మోహన్ — నేనుకూడ రాకూడదా? నే నొంటిగ నిట నుండజాలను.

వెంక — ఎందులకు? మీ రిందే యుండుఁడు, ఇదికూడ మన మిత్రుల గృహమే. త్వ లోనే వచ్చెదము ఇచట మీ కేలోటును జరుగదు స్వగృహమున నున్నట్లుండవచ్చు. (తెరవైపు జూచి) వారిజా!

వారిజ — (ప్రవేశించును) ఏమీ!

వెంక — వీరు మనమిత్రులు, ఏది కావలయునన్నను తత్‌క్షణమే సమకూర్చుచు నామారుగ నీవు చూచుచుండుము.

(అని వెంకటాద్రివు రాజారాంలు నిష్క్రమింతురు)

మోహ — (చూచి తనలో) ఆహా! యేమి యీ మెయంగసౌష్ఠవము!

వారిజ — (తనలో) ఈమోహనమూర్తి నెంతజూచినను తనివి తీరకున్నది గదా!

అను బంధ ము 6.

ఇట్టి సుకుమారుని రేబవలు తాగించి, యిచటనుండి కదల కుండఁజేయవలయునఁట. ఈతని నిచటనే యుంచుకొనుట నాకును సమ్మ

తమే; కాని, ......యేదియెట్లైనను ధనముకొఱకంగీకరింపక తప్పదు గదా? ఎంతకును పల్కరింపఁడే, కన్నెత్తియైన చూడఁడే! ఎంత గంభీర మైన హృదయము! (ప్రకా) స్వామీ! పానీయ మేమైన కావలయునా?

మోహా—వలదు; వలదు.

వారి—మోమోటపడెద రేల? తెచ్చెద నుండుఁడు.

(అని నిష్క్రమించును).

మోహా—తెచ్చెదనని పోవుచున్నదే! ఇపు డేమిచేయుదును? త్రాగు దునా, త్రాగకుందునా? నిరాకరించిన నీవిషయము మిత్రుఁ డెరింగి యాగ్రహించునేమో?

వారి—(గ్లాసుతో ప్రవేశించి) ఇదిగో స్వీకరింపుఁడు (అని బల్లపై పెట్టును).

మోహా—(పుచ్చుకొని) ఎంతసేపో కాలేదు. ఇపు డవసరము లేదు. కాని నీకు ఉత్సాహభంగముగ నుండునేమో! తెమ్ము అట్లే త్రాగెదను.

వారి:—నాకు ఉత్సాహభంగమా? (నవ్వి)

తే. గీ. నిత్య ముల్లాస మొసఁగు పా♦నీయ మొకటి
ప్రియపుంజెలి కెమ్మోవి ♦ పాన మొకటి
వెక్కసం బౌనె యెంతటి ♦ వెడగుకైన?
మత్తిలియుఁ దేటి రోయునే ♦ మధుపుగోల?

మోహా—అందుకు సమాధానము మాటలాడకుండ త్రాగుటయే. (అని త్రాగును.)

వారి—అనుగ్రహింపఁబడితిని.

మోహా—నీవుకాదు నేను.............

వారి—నాచేతిమీఁదుగ నొసఁగుటచేతనా...యెంత భావయుక్తముగ మాటలాడుచుంటిరి! కళాశాస్త్రప్రావీణ్యము లేని, కవితాశక్తి యుండునా?

మోహా—అగుఁగాక నీయూహ తప్పు. మిత్రునిస్వకాంతలచెంతనా! కళాశాస్త్రప్రావీణ్యముఁ జూపుట.

వారి—అదేమి, స్వకాంత లెవరు ?

మోహ—నీవు... వెంకట్రావుగారి.........

వారి—భార్యనా ? అదెట్లు ? అతఁడేమి నాగళమున పుస్తెగట్టెనా ? అగ్నిసాక్షిగ పెండ్లియాడెనా ? లేదే ! ఆతని స్నేహమున సౌశీల్యభంగముకూడ కలుగలేదే ! ఇఁక సరసఁ జేరితినందురా ? అది తప్పిదమగునా ?

మ. పదు లేరీతి దలంచినన్ బతులెటుల్ ♦ భావించినన్ గొంక కీ
కరణిన్ జేతులు జేతులన్ గలుపుచున్ ♦ గాయంబులన్ హత్తుచున్
"బరగన్ బాల్పడ నన్యపూరుషులతో ♦ బ్రాయంపు టిల్లాండ్రె" నా
కరయన్ దోసమె వానిచెంత నటులన్ ♦ సయ్యాటలన్ దేలుటల్.

అదియటుంచుఁడు ఆతనిధనమును వలచితిని. మీరూపమును వలచితిని. మీరు నాహృదయమును దొంగిలించితిరి. ఆతఁడు నా సౌందర్యమునుమాత్రమే దొంగిలించెను. అట్టిచో నాతనికి స్వస్త్రీ నెట్లగుదును ?

మోహన్—(తనలో) ఇపు డేదికర్తవ్యము? నాహృదయ మంతకంతకు తొందరించుచున్నదికాని వెనుకంజ వేయుటలేదు !

వారి—ఏమి మాటలాడక యూరకుంటిరి, "మౌన మర్ధాంగీకార సూచకమనియా" ? అట్లయిన నిఁక నాకోర్కె తీరినట్లే.

(అని మోహనునిప్రక్కన గూర్చుండ మోహనరావు వెనుకకు తగ్గును.)

వారి—అదే మట్లు వెనుకకు జరుగుచుంటిరి?

మోహన్—ఎందులకా ? భయమువైచినది. ఆ భయము[illegible] నీయధరామృత పానమున పటాపంచలు గావించెద[illegible] (అని కౌగిలించుకొనును.)

వారి—నాజన్మ ధన్యమైనది.

మోహన్—నీజన్మ ధన్యమైనదికాని నా భాగ్య[illegible]
ఏమందువా ? యింతవరకూ..... ...

వారి—అదిగో అప్పుడే మోటసరసములకు దిగినది వ్యవహారము. (అని మార్మొగము పెట్టును.)

మోహ—అంతకోప మెందులకు ! నామాట యబద్ధమా !
వారి—అబద్ధ మగునా? మృదువుతప్పిన మాటలు (అని చురచురఁ జూచును.)
మోహ—మృదువుతప్పుట యన నెట్టిది ? (అని చటుక్కున ముద్దు పెట్టుకొనును.)
వారి—(మోహనుని చెంపపైఁ గొట్టును)
మోహ—ఆహా! మృదుపరిమళ విరిహారముతో ప్రహరించిన ట్లున్నదే! ఏదీ నీహస్తపల్లవము ? (అని చేయి ముద్దిడి) ఎంతమనోహర ముగ నున్నది! ఈ హస్తపల్లవముతో నొసఁగిన పానీయ మాధుర్య మిం కెంత రుచిగనుండునో చెప్పతరమా?
వారి—ఒసఁగుట యేమి? నేనే త్రాగించెదను. (అని అట్లుచేయును.)
మోహ—ఈరుచియంతయు నీచేతిలోనిదే! (అని మరల చేయి ముద్దిడఁ బోవును)
వారి—(చేయి లాగుకొని) అబ్బ ! చాలిద్దురూ?
మోహ—చాలకపోతే యింకొక్క ఇయ్యి.
(ఇంకొకగ్లాసు వారిజయే త్రాగించును.)
మోహ—స్వర్గం యిక్కడే అవుపిస్తోంది, యీరసంకన్న నీయధరరసం యింకా బాగుంటుంది ట్రాగుటా.
వారి—అంత తొందర యెందులకు?
మోహ—స్టీం యెక్కి పోటోంది. నీమొగం జిగుజిగు లాడుతోంది. నువ్వు యిద్దరు. యీ యిళ్ళు రెండు. టొండర యెందు కంటావా ?

తే. రంబటో రాము డ్రిడొగో యాఁరాట్రిబడెద్రిడు
ఇందు డడెడ్రొపదిన్ గూడి ౹ చందు డమ్యొ
వ్యాసు డరెరె యహల్యను ౹ పట్రిగొనిమె
ణేణు ణేణు క్రొగలింటు వాఁణీ పురాణీ!

(అని లేవఁబోవును)

వారి—(లేవకుండ నాపి) లేవకుండు, క్రిందపడెదరు.

మోహ—నేను పడటారినా? నీవంటివాళ్ళను వొండ్రిమందిని పడేస్తా.

వారి—అట్లే యనుకొనుడు నాభుజమున చేయివేయుడు గదిలోనికి పోవుదము. (అని లేవదీసి భుజమున చేయి వేయించుకొనును.)

మోహ—యిప్పుడేరి బుజాన వెయ్యేందుకు? పెళ్ళికూటుర్లాగా నావేలు పట్టుకొని వెనక నడువు. (అని చేయి తీయఁబోవును)

వారి—వొళ్ళు తూలుచున్నది. చేయి తీయకుఁడు.

మోహ—టూలడు వొడలమంటేరి. (అని చేయిలాగబోయి యిర్వురును క్రిందబడుదురు)

---

## తృతీయరంగము

[బయలుస్థలము: వెంకటారివు, రాజారాములు ప్రవేశింతురు]

వెంకటా—రాజారాం! మల్లి యెచ్చటనున్నది?

రాజా—ఆచెట్టుక్రింద నున్నది.

వెంకటా—ఆ వచ్చునది వెంకఁడువలె నున్నదే! భార్యచెంతకు వచ్చుచుండెనా?

రాజా—ఇది విచారింపవలసిన విషయమే, రాత్రికూడ ఆతనికెన్నియో కొండెములు చెప్పితిని.

వెంక—రాత్రి యాతఁడు మాయింటికడ లేడా?

రాజా—మీయింటికడనే యుండెను. మీకొరకు నేనచటికి వచ్చి వీథిలోనుండియే మిమ్ము పిలువగా వెంకడు బయటికి వచ్చి మీరు లేరని చెప్పెను. అపుడు వానిని మీవీథియరుగుమీదఁ గూర్చుండఁబెట్టి, యెన్నియో నూరిపోసితిని.

వెంకటా—నేనుకూడ నాతని నిలువీడి రావలదని గట్టికట్టడి చేసితిని; తాగుడున కిదివరకుకన్న నెక్కువగ ధన మిచ్చుచుంటిని.

వెంక—(తూలుచు) తెగండ్రి డార్లో తెగండ్రి అడ్డ్రమొత్తే గడ్రిం మీాన గటిగ్రా ట్రిన్నటా్రను. చెల్లగుర్రి మొక్కేను ట్రన్నిం డంటే ట్రింగులు చెక్కమోటే డా్రముషారా పెజెంటు. డెబ్బ కాషుకోండి డబ్బులేక మోతే నే నిష్టాను.

వెంకటాద్రి—వెంకడూ! ఏమది?

వెంక—(చూచి) దండ్రిం డోరా! గుజ్జంకళ్ళెం చెగ్రేట్టు పట్రికున్నా ఆగట్రింలేదు. అడ్రింతెగమంటే్రి తెగట్రింనేదు. టాటికాయి ల్లాగా ట్రిలకాయ తెగరగోట్రి మంటా్రిరా? మీా పిట్రిం యేం షేయమంటే్రి అడి షేటా్రిను. మీా డాసుణ్ణి.

వెంకటాద్రి—నీవేమియు చేయవలదు. ఇల్లు విడచి రావల దంటినిగదా, ఎందులకు వచ్చితివి? నీ భార్యను చూచిపోవుటకా ?

రాజా—ఇఁక నెక్కడిభార్య? అంతటి నీచమునకు లోఁబడిన భార్యను వెంకఁడు తిరిగి యేలుకొనునంతటి మూఢుఁడా ?

వెంక—అడుగడీ డోరా! చెల్రిసినోరి కంట్రిలోనే వుండి్రి. అమ్మగా రో రూపాయి యిచ్చే్రి టా్రిగేసి యిట్రి తిరిగి కుషాలుగ అట్రి పోడామని యిటా్రి వట్రిండా.

వెంకటాద్రి—(అనుమానము సూచించుచు) రూపాయి నొసంగుటకు కారణము ?

రాజా—మనస్సును కనుకూలముగ నుండుటకు యిచ్చుచుండుమని మీారే చెప్పితిరేమో ?

వెంకటాద్రి—(మొగము మార్చుకొని) అయియుండవచ్చును. ఇదిగో! వెంకడూ! ఈ రూపాయికూడ తీసికొని, యిటేపోయి దారిలో తాగ్రి యింటికిపోయి యింటికడ జాగ్రత్తగ నుండుము. (అని యిచ్చును.)

వెంక—వో, డెబ్బలో, పురుగాడిచే ట్రుపాకెట్టి కాల్చేష్టాను, నేను టాగ్రేడిమీాషొమ్ము ణేణు మీాషొమ్ము. డోరలు యెయ్యి కాలాలు బట్రికాలు ణేణు యెయ్యికాలాలు టా్రిగాలా. కల్లు

పలివేండర్లు పెట్రించాలి. పోటాను ఛూరా! (అని రూపాయి తీసికొని నిష్క్రమించును.)

వెంకటాద్రి—ఇఁక మల్లిచెంతకు పోవుదమా ?

రాజా—అవశ్యము. (అని కొంచెము నడతురు. తెరనెత్తగా చెట్టు క్రింద మల్లి కూర్చుండి యుండును.)

మల్లి—అయ్యొ దేవుడా! నాదేవు డెన్ని సెప్పినా యినే్న నేదు.

అ ను బ ం ధ ము 7.

వెంక—మల్లీ! ఇక్కడ నేమిచేయుచుంటివి ?

మల్లి—నాకర్మం బాబయ్యా!

రాజా—మొండిముండకొడుకు, ఎన్ని చెప్పినను వినుటలేదు.

వెంక—నేనుకూడ నెన్నివిధములనో బోధించుచుంటిని. నాబోధయంతయు చెవిటివానికడ శంఖ మూదిన ట్లగుచున్నది.

రాజా—అన్నట్లు మల్లికా! మీకు మారుమను వున్నదిగదా? ఇంకొకరి నేల కట్టుకొనఁగూడదు ?

మల్లి—మొగుడు సచ్చిమోతే మారుమనుం గానీండి బతికుండగానే యేటి మారుమనువండి ?

రాజా—విడిచిపెట్టినమొగుడు బ్రతికియున్నను చచ్చినవానితో సమానమే ?

మల్లి—యేందండి అంతమా టంటారు. నాయెంకన్న పదికాలాలూ బతికుండాల్సిందే. యియ్యాలకాకమోతే యింకోనాటికై నా నామీద దయొచ్చుద్ది. అచలు మారుమనువంటేనే నా కచయ్యం.

రాజా—నీమీఁద దయకాదు నీ వగుపడినచో చంపివై చెద నను చున్నాఁడు.

మల్లి—పోనీండి మొగుడుసేతుల్లో సత్తే పున్నెమేగా! అంతకన్నా కావాల్సిం దేంది? కట్టాలన్నీ వొక్కమాలి గట్టెక్కిమోతై.

రాజా—ఈ వయసులో ఈవేదాంత మెందులకు ?

(అంత కృష్ణమూర్తి ప్రవేశించి చూచి ప్రక్క కొదిగి)

కృష్ణ—(తనలో) ఆ కూరుచున్నది మల్లి, వీరే వెంకటాద్రివు రాజా రాములు. ఇచ్చట నేమిచేయుచుండిరో కొంచెము తెలిసికొనుట మంచిది. (అని చాటున దాగును)

రాజా—మల్లీ! నీవు చిన్నదానవు, నీకు తెలియదు, మెట్టవేదాంతము లెప్పటికెని గిట్టవు.

మల్లి—అయితే యేంసెయ్యమంటావయ్యా !

రాజా—అదిగో అట్లడిగితివి బాగున్నది. ఇక చెప్పెద వినుము. నీ మొగుడిక సిన్నోల్లడు, నీవు సుందరాంగివి, కాలమంతయు కామముతో నిండియున్నది. విటగాండ్రు చూచినచో నిన్ను విడువరు, రోగపంజరమవు కావలసివచ్చును. దుర్మార్గు లెట్టి ఘోరములు చేయఁజాలరు?

కృష్ణ—(తనలో) ఓహోహో! నీవు కడుసన్మార్గుఁడవు.

మల్లి—రోగాలు తెచ్చుకోవాల్సినంత గాచార మేమొచ్చింది నాకు !

రాజా—అదిగో అదియే నీకు తెలియ దనుచుంటిని.

మల్లి—తెలిసేదేంది ! నువ్వు యిడిసిపెడితే నీపెళ్ళం ఇల్లే లేచిపోయిం దేంది ?

కృష్ణ—(తనలో) మంచిప్రశ్న వేసినది.

రాజా—నా కసలు పెండ్లియే కానిది పెండ్ల మెచ్చటనుండి వచ్చును! ఒకవేళ నున్నను వయసువాఁడను అది యెందులకు లేచిపో వును? ఇఁక నీ కందువా? మొగుడు విడిచిపెట్టుట యట్లుంచుము వదలిపెట్టకున్నను వృద్ధుఁడు ఆతనికడ నీకేమిసుఖము లభించును!

మల్లి—పెళ్ళయ్యాక ముసలాడైతే తప్పుద్దా సుకం నేకపోతే తప్పుద్దా. ఆబుద్ది పెళ్ళిసేసేవోళ్ళకుండాల. సిన్నపిల్లల్ని ముసలోళ్ళకిచ్చేటప్పుడే ఆళ్ళవుసురు తగులుద్దని ఆళ్లకు తెలిసుండాల. నా గతేంది! పపంచకవంతా కసాయినుకానాలై పోంది. పెల్లికాకముందే ముస

లోడికి కడుతుండారని తెలిత్తే యెందులోఅన్నా పడి సావటం మంచిది. అయిందాకా తెలీసీరుగా అయాక యిం కేంసేత్తారు?

వెంకటాౘి—(తనలో) ఇది వినునట్లు తోచదు. (ప్రకా) రాజారాం! ఇంతలో నే నొకపరి యింటికేగి వత్తును.

(అని చెప్పి నిష్క్రమించును)

రాజా—ఇదిగో, మల్లీ! నీబాగుకొరకు చెప్పుచుంటిని. ఇటు చూడుము. ఈచెట్టుక్రింద నుండేఅవస్థ తప్పిపోవును. ఈ కారపుమెతుకులు తిన నక్కరలేదు. మృష్టాన్నభోజనము. కోరినచీరెలు ఒడలినిండ నగలు అత్తరునూనెలు సెంట్లు సబ్బుబిళ్ళలు అన్నియు తెచ్చియిచ్చెదను. నీ వెన్నడును అనుభవింపని భోగ మనుభవించెదవు. నామాట వినుము. నావెంట రమ్ము.

మల్లి—ఛీ! నీజిమ్మడ ఇందుకా యీసొదంతా? యిందుకా? యెంకటాౘివయ్యా నువ్వూ యింతపని సేశారూ? మీరేనా నా సాయికి యీఅబద్దాలు సెప్పింది? తెల్పింది తెల్చింది మమ్మన్ని చూత్తే మీకళ్ళు మండిపోనాయా? నెగు యీడనుంచి నెగు. యీపాలి యీమాటెత్తేవంటే బుద్దిసెప్పిత్తా. నా గాచారానికి నే నేడుత్తావుంటే.

రాజా—మల్లీ! తొందరపడకుము ఇంకొకరోజు వచ్చెదను. బాగుగ నాలోచించుకొనుము. (అని నిష్క్రమించును.)

కృష్ణ—ఓరీ తుచ్ఛులారా! ఎంతటి ద్రోహమునకు పాల్పడితిరిరా! ఈయమాయకురాలి నోడిలో వైచుకొనుటకా మీ ప్రయత్నము? ఇట్టి పవిత్రచరిత్రల నెందరిని మానభంగ మొనర్ప ప్రయత్నించుచున్నారో, ఇంక నెందర ప్రయత్నింప నున్నారో కదా? ఎన్నిసంసారములు దగ్ధ మొనర్చితిరో, ఎన్నిసంసారములు భస్మీపటలము గావించుచున్నారో, యెన్ని ధ్వంసము గావింప నున్నారో? "పాపీ చిరాయు" వన్నట్లు జగదరక్షకుండగు యీశ్వరుండు నీపాపపర్వతముల కంతము జూపకుండెనే! ఆహా

ఆమె నీచకులాంగన యైననేమి? ఎంతటి నిష్కళంకహృదయము! అనుదినమును ప్రాతఃకాలమున లేచి యిట్టియిల్లాలికి నమస్కార మొనర్చినచో సర్వపాపములు నశించును. ఇట్టి సాధ్వీమణు లితరకులములలో నెందరున్నారో కదా! ఇట్టి కళంకరహిత లగ్ర కులములలో కరవగుచున్నారు. అమ్మా! మల్లీ !

మల్లి—కుట్టమూర్తిగారా! దొరగోరూ! దణ్ణంమెడతా నాగతేం చెప్పనూ?

కృష్ణ—చెప్పనక్కరలేదు. ఈ చాటుననుండి యంతయు కనుగొంటిని. నీవింతటి పతిభక్తితోడనే యుండిన నిన్నితుచ్ఛు లేమియు చేయఁజాలరు.

తే. గీ. నీపవిత్రభావముచేతనే ♦ నీవిభుండు
నిన్ను దరిజేర్చి యేలును ♦ నిజము సర్వ
సాక్షి గలఁ డిందులకుఁ బూట ♦ శంక యేల
సతికి పతిభక్తి మించిన ♦ వ్రతము కలదె ?

మల్లి—అట్టనే తల్చుకుంటుండా దొరా!

కృష్ణ—తప్పక నీకు శుభము చేకూరును. పోయివచ్చెద.



—

# రంగూన్ మెయిల్

## చతుర్థాంకము

### ప్రథమరంగము

(మోహనరావు గృహము : సుశీల యొంటరిగ విచారముతోఁ గూర్చుండి యుండును)

అనుబంధము 8.

సుశీల—

సీ. స్వామి వేళకు రాక ♦ జాగొనరించిన
నెంతయు భీతిచే ♦ నెద కలంగు
వేడిపదార్థముల్ ♦ విభుఁ డారగింపక
తడసిన నెనలేని ♦ తాప మొదవు
పతి కార్యభారంపు ♦ బడలికఁ గొన మది
నంధకారము గ్రమ్ము ♦ నట్టు లగును
ఒడయున కీసుమంత ♦ నెడద నొచ్చెనటన్న
ప్రాణముల్ పోయెడి ♦ భంగి తోఁచు

తే. గీ. కాంతునకు నొక్క చిరుచీమ ♦ గరచె ననఁగ
మిన్ను పైఁబడినట్టుల ♦ మెయికిఁ దోఁచు
నట్టితరి నక్కటా యిట్టు ♦ లాత్మవిభుఁడు
ఇల్లు గని రెండునాళ్లాయె ♦ నెట్టు లోర్తు ?

హా నాథా ! కార్యస్థానమున నున్నపుడు సైతము ఘడియ కొకపరి గృహమున కరుదెంచి ముద్దుకుమారుని వక్షమున హత్తుకొని ముద్దిడి, నాతోడ నెన్నియో మృదుమధుర హాస్యోక్తుల పచరించి

యంతులేని యాహ్లాద మొసంగుచుండెడివారే! ఈ వియోగ మెట్లు భరింతును? ఋణబాధల ననుభవింపలేక యెట్టైన గ్రామాంతరముల కేగితిరా? తనువుపై రోసి యింకేదేని సాహసమునకుఁ బాల్పడి యుందురా? నా హృదయము మిక్కిలి శంకాకులిత మగుచున్నదే! హే! జగన్మాతా! ఇఁక నీకన్న నాకు వేరు శరణ్యము లేదు. జగజ్జననీ!

అనుబంధము 9.

చ. నిరతము నిన్ భజించెడు మ♦నీషుల కెన్నఁడు దుర్నిమిత్తముల్
జరుగ వటంచు పల్కుదురు ♦ సత్యము ప్రాజ్ఞులు; రిత్త గాదు; త్వ
చ్చరణయుగంబె నమ్మి, యని♦శంబును నెమ్మదిఁ గొల్చుచుంటి, నీ
పరమకృపారసంబు బరు♦వంగదె దీనులపైని శాంకరీ!

రాజారాం:—(ప్రవేశించి) మోహనరావుగా రున్నారా?

సుశీల:—(ఒకప్రక్క కొదిగి) ఇంటలేరు.

రాజా:—లేనిసంగతి నెరుఁగుదును. ఎచటనున్నది కూడ నెరుఁగుదును. ఎరిఁగియుండి అట్లడుగుట యెందుల కందువేమో? ఇదివర కెన్నడును మీతో మాటలాడియుండనందున ఆ ప్రశ్న వేయవలసి వచ్చినది. మీ కొకవార్త నెరింగించుటకై మోహనరావుగారే నన్నంపిరి.

సుశీ—క్షేమముగ నున్నారా? ఎచట నుండిరి?

రాజా—ఆఁ వేశ్యాబాహుబంధమున క్షేమముగ నున్నారు.

సుశీ—(తనలో) ఆహా! ఈతఁడు మృదువుతప్పినమాట లాడుచున్నాడే. ఎట్లైన నీతని శీఘ్రముగ బంపివేయుట మంచిది. (ప్రకాశ) పోనిండు. ఆవిచారము మీ కెందులకు? ఏదేని యవసర కార్యములున్న పోయి నిర్వర్తించుకొనుఁడు.

రాజా—నాకు వేరే యవసరకార్యములును లేవు. ఉన్న యవసర మేమో యిచ్చటనే యున్నది.

సుశీ—ఇచట నేమున్నది?

రాజా—ఏమున్నదా? మీస్థితి విచారించుటయే అవసరము. నీనాథు

నకు నిరువదినాల్గుగంటలును త్రాగుడు, ముండ. నే నెంతబోధిం
చినను ఆ రెంటిని విడచి యీావలకు రాఁజాలకున్నాఁడు! రాఁడు!
ఇఁక నీకు దక్కఁడు. నీ వొంటరి జీవనము..... ...

సుశీ—చాలుచాలు. ఇఁక నూరకొనుము. నాగతి యెట్లైన నీకేల?

రాజా—నా కేల ననుకొనిన నింత దూరమే వచ్చియుండను. మీా
మీాఁద జాలికలిగి మీామేలు తలఁచి శ్రమకోర్చి యిటు వచ్చి
తిని. ఇంతకన్న నెక్కుడుగ నిను సుఖపెట్టఁదలఁచి నిను నాయింటఁ
జేర్పఁదలఁచి యిటు వచ్చితిని.

సుశీ—(తనలో) ఆహా! ఈ తుచ్ఛుఁ డెంతకు సాహసించు చున్నాఁడు!
ఇప్పు డేమిసేయుదును? సౌమ్యముగ బోధించి చూచెద.(ప్రకా)
అయ్యా!

మ. పరువే నీ కిది, యిట్టి చెట్టఁ దలఁపన్ ♦ భావ్యం బొకో? నీకు సో
దరిగానే హితునాలి నౌటు? నిది మి♦థ్యావాంఛయేగాక, యో
ర్తు రె సాధ్వీతతి నీదుచర్యలకు? నిన్ ♦ దుష్టాత్ముఁగాఁ జూడ రే?
పరకాంతన్ గవయంగఁగోరుటలు పా♦పంబౌఁగదా సోదరా!

రాజా—ఓహో! నీతులు చెప్పుచుంటివా? మనకులములే వేరగు
నప్పుడు నీవు నాకు సోదరివెట్లగుదువు? అయినను నా వాక్య
ములు నీ కిప్పుడు నచ్చవు. నీమగఁడు తప్పత్రాగి వచ్చి, నిన్ను
నెముకలన్నియు విరుగ దన్నుచు పలుబాధలుపెట్టి నిన్నేలక
యేడ్పించినప్పుడు నీ యీసిరాకరణమునకు విచారింపకపోవు.
అపుడు నాకు వార్త నంపకపోవు. నేనువచ్చి నిన్నుఁ జేపట్టక
పోను. ఇప్పటి కిచ్చటినుండియే ముద్దుఁగొని తృప్తినందు
చున్నాను. (అని తనఅరచేతివైపు వ్రేళ్ళనే ముద్దిడికొని తృప్తి
నభినయించి వెడలిపోవును.)

సుశీ—(కోపము దుఃఖము నభినయించుచు) ఓరీ! తుచ్ఛుఁడా! ఎంతటి
యమానుషకృత్య మొనర్చితివిరా? నీచా! నిరంతరపతిపద
ధ్యానతత్పరనగు నన్ను, అన్యపురుషుల గ్రిగంటనైన నీక్షింపని
నన్ను, నిష్కలుషమానసిక నగునన్నుఁ జూచి నాయెదుట నెంత

దుష్టాభినయ మొనర్ప సాహసించితివిరా! క్రూరా! సద్వంశ
సంజాత నగు నేను నీ నీచదృష్టికి గణికవలెఁ గనుపడుచుంటినా?
మిత్రద్రోహీ! అతులితైశ్వర్య సంపన్నులై సర్వాలంకార
శోభితులై సకలవైభవోపేతులై సద్గుణగరిష్ఠులను సకలవిద్యా
పారంగతులను పరస్త్రీపరాఙ్ముఖులను గన్న యీ భారతమాతృ
గర్భమున తులసివనమునందు గంజాయి మొక్కలవలె, సంపెంగ
వనమునందు కాలసర్పమువలె భారతసాధ్వీ యాత్మగౌరవ
విధ్వంస మొనర్చుటకా నినుఁబోలు తుచ్ఛపురుషులు జన్మించి
నది? భారతనారీమణుల దుష్కీర్తిపా లొనర్చుటకా మీవంటి
యుమ్మత్తవిత్తనము లుద్భవించినది? పతివ్రతా మతల్లుల
వంచించుటకా మిముఁబోలు కప్పకూతపాము లవతరించినది?
సతీపతుల ప్రేమప్రవాహముల కడ్డుకట్టలు వైచుటకా మీ
వంటి వెన్నమాటువిషఘుటికలు వెలసినది? నిప్పువంటిసంసార
ములు నీటఁగల్పుటకా మీ రిట్టి దురాచారము లొనర్చుట?
పాపమని యెంచక మున్ముం దిందులకుఁగలుగు ప్రతిఫలముల
నూహింపక యమదండన లనుభవింపవలసి వచ్చునను భీతియైన
లేక మీరొనర్చు చుండగములే మిమ్ము విధ్వంస మొనర్ప
కుండునా? మీదుహూహాలే మీకంతము జూపకుండునా? (దుఃఖ
ముతో) హా! హృదయేశ్వరా! యిత్తరి మీరింటియం దుండి
యున్నచో నీకుటిలుఁ డిట్లొనర్చియుండునా? నన్ను కన్నెత్తియైన
వీక్షింపఁగలఁడా? అయ్యో నాథా! ఇట్టిదురంతములు వాటిల్ల
కుండ నాదండ నుండవైతివే!

సీ. ఎందుంటివో యిప్పు ♦ డేండ్లుపూండ్లుగ నుండె
త్వద్దర్శన మొనర్చు ♦ దారి యెట్లు?
స్వప్నంబున న్విన్న ♦ చందమయ్యెను భవ
న్మధురోక్తులను విను ♦ మార్గమెట్లు?
జన్మాంతరంబైన ♦ సరణిగాఁదోచె త్వ
త్పాదాబ్జములు గొల్చు ♦ భాగ్యమెట్లు.

భావనలోపలఁ ♦ బరగుచునుంటివి
ప్రత్యక్షముగ నిన్నుఁ ♦ బడయుటెట్లు?
తే. గీ. ఎటుల నినుగాంతు సేవింతు ♦ నెలమిగాంతు
ఏది దిక్కింక నాకు నా♦హృదయనాథ!
తడసితివయేనిఁ దనువింక ♦ విడచుఁబడతి
దర్శనం బిమ్ము ప్రాణముల్ ♦ దక్కనిమ్ము.

నాథా! యీవియోగమును భరింపలేక నేనే యసువులవీడినచో నీ చిన్నికుమారునకు రక్షకు లుండరు. భవన్ముఖారవింద సందర్శన మొసంగి నీ ముద్దుకుఱ్ఱని గో డాలింపనిచో నీబాలుఁడు గుండెవీలును. లోకబాంధవురాక కెదురుచూచు పద్మములభంగి శరచ్చంద్రునకై తపమాచరించు చకోరంబుల చందంబున భవద్దర్శన మపేక్షించి నిరీక్షించు మాకు సాక్షాత్కరించి మా దుఃఖమున కంతముఁజూపుఁడు. (కొంచె మూరకుండి) అయ్యో! ఇఁక నెక్కడినాథుఁడు, ఎక్కడి లోకము? మధుపానపిశాచ మావహించినది. గణికాదుర్గంధముసోకినది. ఇంకను నాథునిగూడి ప్రేమతరంగడోలికల నూగుటయా? అంతటి యోగ్యతయే నాకున్నచో నా నాధునకు వెంకటాద్రి రాజారాముల స్నేహమే యలవడకయుండెడిది. నా జనకుని వాక్యములయం దొక్క యక్కరమైన పొల్లుపోవుటలేదే? దైవమా! నా గతియేమి? దీన శరణ్యా! నే నహర్నిశ లిట్లు దుఃఖాబ్ధిలో మునింగి యుండవలసినదేనా! దుస్సాంగత్యము గూర్చితివి, చెడునడత లలవరచితివి, కూటికిఁగూడ గతిలేనంతటి హీనస్థితికి దెచ్చితివి, నాధుని ముఖావలోకనము కర వానర్చితివి. అధఃపాతాళమునకుఁ దొక్కితివే! దీనదయాళూ! జగద్రక్షకా! నా కిది పరీక్షయా? నీ పరీక్ష కాగునంతటి సామర్థ్య మబలనగు నాకడ గలదా? ఆపద్బాంధవా! నాదుఃఖమున కంతముఁ జూపవా? నన్ను దరిజేర్పవా? నీ కరుణార్ద్రదృష్టుల నొక్కపరి నాపైఁ బ్రసరింపఁజేయవా!

తే. గీ. దేవదేవ! జగన్నాథ ♦ దివ్యతేజ!
మానితాకార! శ్రీవేణు♦గానలోల!

నన్ను రక్షింప రారా యా♦పన్నరాల
శ్రితజనావన! లోకేశ ♦ శ్రీనివాస.

అనుబంధము 10.

శ్యామసుందర్—(ప్రవేశించి తల్లినిజేరి) అమ్మా! ఎందుకే యేడు స్తున్నావు?

సుశీ—లేదు తండ్రీ! నే నేడ్చుటలేదు.

శ్యాం—అదేం కళ్లెంబడి నీళ్లొత్తుంటే నాకూ ఆలా యేడుపొత్తుంది.

సుశీ—అయ్యో చిట్టిబాబూ! యెచ్చటి ముద్దుపలుకులురా యివి! తండ్రీ! నీ చిన్నిబొజ్జ యెట్లేడ్చుచున్నదో చూడుము. నాయనా! ఇట్లెన్నియుపవాసము లోనర్చెదవు? బువ్వతిను నాన్నా!

శ్యాం—ఊఁ ఊఁ నాన్నరాందే నే తిన్ను.

అనుబంధము 11.

సుశీ—(కుమారుని నోడిలోఁ జేర్చుకొని) అయ్యో యెంతగతిపట్టినదిరా తండ్రీ! నాన్న యిల్లేమరచినప్పుడు నాన్నతో కలిసి భోజన మొనర్చుట యెట్లుతటస్థించునురా కుమారా! అదిగో తాతయ్య వచ్చుచున్నాడు నాన్ననుతోడ్కొనివచ్చును పండ్లుకొనిపెట్టును.
(అంత జానకీ కృష్ణమూర్తులు ప్రవేశింతురు.)

శ్యాం—ఊఁ ఊఁ (అని గంతులుపెట్టును.)

కృష్ణ—అమ్మా! యేమది?

సుశీ—తండ్రీ! యేమున్నది?

చ. కలధనమంతఁబోయినను ♦ కాంతుని బెన్నిధిగాఁ దలంచి చిం
తిలఁదగదంచు నెంచితి ను♦దిక్ దురదృష్ట మదేమొ నావిభుం
డిలుగని రెండునాళ్ళగు నె♦టేగెనొ బిడ్డఁడు నాన్నయేఁడి నే
వలవను బువ్వ యంచనఁగ ♦ వ్రియ్యలగుఙ్ మన మేమిచేయుదుఙ్.
అమ్మా! మా కెంతటి దురవస్థ సంభవించినది! (అని దుఃఖించును.)

జాన—అమ్మా! రెండుదినంబులనుండియు నీనాథుఁ డింటికి రాకుండి నప్పుడు మాకింత కబురంపిన బాగుండెడిదిగదా?

సుశీ—కబురంపుట కిం దెవరుండి రని? అయినను పతిచర్యల నన్యుల కెరింగించుట యుత్తమకాంతాలక్షణమా?

కృష్ణ—తల్లీ! అదిదా నీయూహ? ఇదంతయు నా గ్రహచారము. నాసద్బోధలన్నియు మీకు విషప్రాయము లగుచున్నవి. చూచి తివా సహవాసదోష ఫలము?

చ. చెడుసహవాసముల్ సలుప ♦ చేటొనగూడుట తథ్యమంచు నే
నుడువఁగ నాఁడు నీమనము ♦ నొచ్చె, విభుండును దుష్టమైత్రి తా
నుడుగఁగ నోర్వఁడయ్యె పరు♦షోక్తుల నాఁడుఁ గడంగి, వారలే
కడుసుగుణాఢ్యులం చనఁడె? ♦ గాంచితె వారల సద్గుణంబులన్?

అది యట్లుంచి, కలిగినకష్టములు తలిదండ్రులకుఁగూడ తెలుప కున్న నవి తొలంగించుకొనుట యెట్లు?

సుశీ—గ్రహచారమున కెవ రేమిచేయఁగలరు?

కృష్ణ—బాగున్నది.

జాన—పోనిమ్మా. సుశీ! నీవు భోజన మొనర్చితివా?

సుశీ—నేను భోజనముచేయుటయా? అయ్యో! నాకెక్కడిభోజనము? ఏనాఁడు రంగూన్ మెయిల్ నడిసముద్రమున నంతర్ధానమైనదో నాఁటితోడనే నాకును నిద్రాహారములకును ఋణముతీరినది. ఏనాఁడు ఋణతీర్మానమునకు నేషనల్ బ్యాంకువారు నోటీసొసంగిరో ఆనాఁడే నాకును నాయైశ్వర్యమునకును ఋణముతీరినది. ఏనాఁడు వెంకట్రావు రాజారాములు నాయింటఁ బ్రవేశించిరో ఆనాఁడే నాకును నాసౌఖ్యమునకును ఋణముతీరినది. ప్రాణములు మొండివడి విడువలేక జీవచ్ఛవమువలె బ్రతికి యుంటిని.

కృష్ణ—అమ్మాయీ! ఏటికి కట్లు చూపించుకొందువు? నిద్రాహారములు మాని అహర్నిశలు దుఃఖాంబుధిలో మునింగియున్నంతమాత్రమున సర్వసుఖము లొక్కపరి యలముకొనునా? కష్టము లొంటిగ రావను సామ్యము నెరుఁగవా? మూల్గుచున్న నక్కపైననే తాటిపండూడిపడును. ఇది నైజము. నీవలె దుఃఖాక్రాంతలైనవా రెందరో గలరు. నీపతివలె భ్రష్టులైనవా రెందరో గలరు. ఎవరైననేమి యిట్టిమైత్రి యలవడినపిదప?

తే. గీ. ధూమమున నగ్ని మలినుఁడై ♦ తోఁచరినట్లు
విమలుఁడై యెంతో విఖ్యాతి ♦ వెలసియున్న
ఘనున కేనియు దుష్టసాం♦గత్యమొదవ
మాన్యతం గన్న సత్కీర్తి ♦ మాసిపోదె?

సుశీ—జనకా! రెండుదినము లింటికి రానంతమాత్రమున భ్రష్టులైన ట్లెంచవలసిన దేనా?

కృష్ణ—అమ్మా! ఇంకను నేలదాచెదవు? జరుగుచున్న వన్నియు నెరుఁగుదును. జరుగఁ గలవికూడ నెరుఁగుదును. దుష్టమైత్రి యూరక విడుచునా? త్రాగు డలవడియే యుండును. వేశ్యాసంపర్కము లభించియే యుండును. నీవు దాచనెంచినను దొంగతనమును రంకుతనమును దాగునవియా? త్రాగినవాని సంగతి తనంత తానే బయల్పడదా?

సుశీ—నేనుమాత్ర మట్లంటినా? ఋణబాధలు పడలేక యెట్టి ప్రియత్నములైన నొనర్చుచు వీలులేక యుండిరేమో, లేక గృహమునకు వచ్చిన ఋణదాత లింటి కరుదెంచి బాధింతురేమో యని యెచటనైన నుండిరేమోయని యట్లంటిని.

కృష్ణ—ఎట్లున్న నేమి? వెతకి నీనాథుని నీకడఁజేర్తును. పోయి భోజన మొనర్పుము. (అని నిష్క్రమించును.)

సుశీ—అయ్యో! ఎచ్చట నిద్రించుచుండిరో! ఎచట భుజించుచుండిరో! ఎట్టి యగచాట్లఁ బడుచుండిరో! ఎందుండిరో! ఎట్లుండిరో! అమ్మా! నాయనగారి పిచ్చియేగాని............

జాన—ఎచట నున్నను వెతకి తీసికొనివత్తురుగాని యూరకరారు. లెమ్ము. ఇద్దరకును భోజనము పెట్టెద. బాలునకు శోషవాడము నట్లున్నది.

సుశీ—అమ్మా! పతివ్రతాధర్మము లెరింగిన నీ విట్లాడిన నే నేమనఁ గలను?

జాన—నీపతి యెచ్చటనో భుజించియే యుండును. అదిగాక కుమారుని నేమముకొరకైన నీవు భుజింపకతప్పదు.

సుశీ—అమ్మా! నా కాకలియే లేదు. కుఱ్ఱవాని నెట్లైన భుజింపఁ జేయుము. నేనుకూడ చెంతఁగూర్చుండెద. (అని లేచు చుండఁ దెర పడును.)



## ద్వి తీ య రం గ ము .

[వేశ్యగృహము: మోహనరావొంటిగఁ గూర్చునియుండఁ దెరలేచును.]

మోహ—ఈ గృహమునకుఁ జేరిన వేళావిశేష మెట్టిదోకాని మిక్కిలి సుఖముగఁ గాలక్షేపము జరుగుచున్నది. ఋణస్థులబాధ లేదు కదా ? ఎట్టికష్టములయుం దైననేమి?

ఉ. తీరనికష్టముల్ గలిగి ♦ ధీరత గోల్పడి కుందువేళలన్
వారుణి గ్రోలి వేడ్కచెలు♦వన్ దరి జేర్చిన వంతలన్నియున్
దీరి విశేషసౌఖ్యములఁ ♦ దేలుటెకాక యుగంబు లేనియున్
మారవె రోజులం బలెను ♦ మారదె భూస్థలి స్వర్గమట్టులన్.

ఇచట నాకు బ్రాందికి లోటులేదు, సానికి లోటులేదు. సానులలో వారిజయంతటి గుణవంతురా లున్నట్లు ఎన్నడును వినియెరుంగను; ఏ గ్రంథమునను జదివియెరుంగను. ఆ తలతిక్కసిద్ధాంతములను

వారియు కవులందరు వారిజగుణములను గ్రహించినచో వారి వారితలుదిద్దుకొనవలసినదే. వారివారితలకును దీనిగుణములకును హస్తిమశకాంతరమున్నది.

చ. వెలచెలి వేసకత్తె యను ♦ వెఱ్ఱినుడుల్ పలుకాడు వారియూ
హలఁదొలఁగింప రూపవతి♦యై సుగుణాఢ్యయు ప్రేమరాసియై
వలపులఁజిమ్మ యీతరుణి ♦ వారిజ యెప్పుడు నన్ననంగ సం
కులసమరంబులన్ ముదము♦గూర్చుచు దైవముగాఁగఁ గొల్చెదున్.

వారిజా! (అని కేకవైచును.)

వారిజ—(ప్రవేశించి) ఎందులకు?

మోహ—ఎందులకా? నన్నొంటిగ విడచి లోని కేగుట భావ్యమా? దాహము వైచుచున్నది. మధుపానమో, యధరపానమో లేకున్న నది తీరుటెట్లు?

వారి—మధు వైపోయినది.

మోహ—అటులైన నీయధరామృతమును త్రాగెద నిటురమ్ము.

వారి— మీకు కవిత్వ మాశుధారవలెఁ బ్రవహించుచున్నదే?

మోహ—కవిత్వమన్న నీ కంత తేలికగ నున్నదికాని అం దెంత మాధుర్య మున్నదో యెరుఁగుదువా?

సీ. ఐశ్వర్య మిచ్చి మ♦హాభోగినిన్ జేయు
కలదెల్ల నూడ్చి బి♦కారిఁజేయు
రణరంగమందు వీ♦రాధివీరు నొనర్చు
భీరువై దురమునఁ ♦ బారఁజేయు
జనవంద్యుఁడైన స♦చ్చారిత్రునిన్ జేయు
దుర్వ్యసనాల బల్ ♦ ధూర్తుఁజేయు
కామినీశతమద♦గర్వఖర్వ మొనర్చు
రసికునిఁజేయు దు♦ర్బలుని జేయు

తే. గీ. అమితసంతోషిఁ జేయు దుః॰ఖార్తుఁ జేయు
నటకుఁ బ్రేక్షకుఁ బాఠకు ॰ నటులె, సర్వ
మనుభవించు తా గ్రంథర॰చనమునందు
కవి, తనకవిత్వమాధుర్య॰గరిమకతన.

వారి——మిగతవిషయము లెట్లున్నను నే నొకటిమాత్రము గ్రహించితిని. వేయిమంది విటుల సాంగత్య మొనర్చినను ఒకకవితో సాంగత్య మొనర్చినంత రసికత లభింపదు.

మోహ——నీమాటలకేమి నాకోర్కె దీర్చుతివికాదు!

వారి——(తనలో) ఎట్లైనను తాగుడు మాన్పఁ బ్రయత్నించుచుండ నీతఁడు విడుచునట్లులేదు. (ప్రకా.) అయిపోయినందులకు విచారించుచున్నాను. ఏమిచేయువలయును?

మోహ——(తనలో) మధువులేదు. అన్నట్లు శాంతకబురులకు కమ్మలకు అంతులేదు. అచట కావలసినంత బ్రాంది యుండును. అచటకుఁబోయిన నా మెకోర్కెయు నాకోర్కెయుఁగూడఁ దీరగలదు. (ప్రకా.) ఇపుడే వచ్చెదను. (అని లేచును.)

వారి——ఎచటకును బోవలదు. ఇప్పుడు తెప్పించి యిచ్చెద నుండుఁడు. (అని చేయిపట్టుకొనును.)

మోహ——ఇపుడే వచ్చెద ననుటలేదా? (అని చేయి విడిపించుకొని నిష్క్రమించును.)

వారిజ——(అటుచూచుచు) త్వరగ రావలయుఁజుమా! మిమ్ము విడిచి నే నుండలేను. (మెల్లగ వెనుకకువచ్చి, కూరుచుండి) ఆహా! ఏమి నాభాగ్యము! ఎంతటిరసికాగ్రగణ్యుఁడు నాకు లభించెను!

ఇట్టి రసికాగ్రగణ్యునకు తాగు డలవఱచి వెంకటాద్రి కన్యాదాతయై నామూలమున నాతని యాస్తినంతయు రాబట్టుకొని యాతని సర్వనాశన మొనర్ప సమకట్టినాఁడు. అయిదువేలరూప్యములవర కాతనికి సాయమొనర్చెనఁట. అందులకై యేబదివేల

సూప్యముల కీనోటుపై కృత్రిమవ్యాపారమున సంతకము చేయించ వలసినదని యాజ్ఞ. సంతకము చేయించితిని కాని యిది వెంకట్రావున కిచ్చుటకుమాత్రము నామన మంగీకరించుటలేదు. ఇయ్యకున్న నన్నేమిచేయఁగలఁడు? రాజారాం ప్రతిబంధక మొక్కటియున్నది. ఆతనితో విరోధము త్రాచుపాముతో పగ పెట్టుకొన్నట్లే.

(అంత రాజారాం ప్రవేశించును)

రాజా—(చూచి) మహారాణిగా రేదియో దీర్ఘాలోచనలో నున్నట్లున్నది.

వారి—ఏమున్నది? మహారాజులదర్శనమే యప్పుడప్పుడగుటచే కారణమేమా యని యాలోచించుచున్నాను. అయినను పదియారువేల గోపికాస్త్రీలకును ఒకేపరి దర్శనమిచ్చుటకు శ్రీకృష్ణునకున్నంతమహిమ మీకడ లేదుకదా?

రాజా—ఓహో! ఎక్కడి కెక్కడికి లంకె బెట్టితివి! నాకంద రుంపుడుగత్తె లుండిరా?

వారి—లేరని మీరుమాత్రము నిర్ధారణగఁ జెప్పఁగలరా! కూర్చుండుఁడు.

రాజా—(కూర్చుని) నీయూహ లన్యథా యెట్లగును? ఏదీ యొకముద్దు. (అని ముద్దిడును)

వారి—ఏ మాస్వాతంత్ర్యము?

రాజా—స్వాతంత్ర్యము నాకుఁగాక యింకెవరికి? ఇప్పటి కెందరుమిత్రుల సర్వాంగక్షౌరము గావించి వారిధనమంతయు నీకు చెందునట్లు చేసితిని; ఎందరఁ జేయుచుంటిని; యెందరఁ జేయనుంటిని? అంతయు నీబాగుకొఱకేకదా? అట్టినాకు సర్వస్వాతంత్ర్యము లేదా?

వారి—ఓహో! అట్లయిన నీపేరు రాజారాం కాదు.

రాజా—కాకున్న డాఘర్మ్యము యందువా? నీ వెట్లన్నను నాకిష్టమే. ఇతరులన్న నే నోర్వను. అని వారు బ్రతుకలేరు.

వారి—ఎట్లు బ్రతుకగలరు? పౌరుషమున కేమి లోటా?

రాజా—అదీమాట. నాతత్వము బాగుగ గ్రహించితివి, ఇందుల కొక యాలింగనము బహుమతి. (అని కౌగిలించుకొనును).

వారి—అగునుగాని వెంకటాద్రివు మోహన్‌రావుగారిని సర్వనాశన మొనర్ప సమకట్టుట నా కిష్టములేదు.

రాజా—ఓయి తెలివితక్కువా? ఆయాస్తియంతయు ఆతనికికాదు నీకు చెందునట్లు చేయుమని కోరక; యిష్టములే దందువేమి?

వారి—వ్యవహారమంతయు నాతని పేర నడచుచుండ నాకెట్లుచేరును?

రాజా— అదెంతపని?

మ. నిలుమన్నన్ నిలుచుండు నేద్వుమనఁగన్ ♦ సిగ్గాఱ్చి నిల్లాలితోఁ
బలుకన్వద్దన మాను, గ్రోలు విసమన్ ♦ బాలంబలెన్ జెప్పుచోన్
చెలువా! యాతఁడు కీలుబొమ్మవలె నా♦చే నుండు నెల్లప్డు చిం
తిల నీకేటికి వానిసర్వమును స్వా♦ధీనంబు గావింపనే?

వెంకటాద్రి వొకపరి యింటికేగివచ్చెద నని పోయెను. ఇపుడే రాఁగలఁడు నేనిటనుండి తొలగెదను. నీవుగూడ కొంచెము బెట్టుసరి చేసి ప్రయత్నింపుము (అని నిష్క్రమించును)

వారిజ—ఇదియు కొంతమేలే. అనుభవించుటలో వైద్యుఁడు వకీలు వణిజుఁడు వేశ్య యీనల్వురును నెప్పుడో యొకప్పు డొకయంశ నను భవించితీరుదురు.

(అంతట వెంకటాద్రివు ప్రవేశించును)

వెంక—(చూచి) వారిజా! మోహనరా వెటుపోయెను?

వారి—ఇపుడే యెచ్చటికో పోయెను.

వెంక—ఎందులకు బోనిచ్చితివి? ఎప్పుడును విడువకుండ నీదండ నుంచుకొమ్మనిగదా తెలిపితిని?

వారి—నాకు నీయాజ్ఞయేమి? నీ కింతదుర్బుద్ధి యెందులకు?

శా. ఏలా యింతదురాగతం బకట న♦న్నీలీల నర్పించి యా
మూలాసన్ ధనముల్ గడింతు ననుచీ♦పూన్కిన్ గనన్ సిగ్గగున్
మేలా యెందుల కీదురాశ పయికూ♦ర్మిన్ జూపి నన్మిత్రుని
ర్మూలంబు నొనరింతె వంచనము పెం♦పున్ గూర్చునే యేరికిన్?

వెంక—ఓహో! యెంత నీతిశాస్త్రప్రవీణురాలవైతివి?

వారి—నానీతిశాస్త్రప్రవీణత నీకెందులకు? మీరిఁక నిచటనుండి దయ చేయవచ్చును.

వెంక—ఎందుచేత పోవలయును?

వారి—నే నితరులసొత్తు నగుటచేత.

వెంక—అదెట్లు?

తే. గీ. తరుణి! నీ వుండుమేడయుఁ ♦ దాల్చు నగలు
కట్టు పుట్టంబులున్ దిను♦నట్టి తిండి
నావి; నిన్నుంచుకొంటచే ♦ నీవు నాదు
సొత్తె యైతివి; నీదగు ♦ సొత్తి కేది?

వారిజ—ఈ గృహముపై నీ పేరున్నదా? ఈ యాభరణములపై నీ పేరున్నదా? ప్రతిమాసమును నాకంపుచున్న వస్తుభాండారముల నేదుకాణమునందైన నీయుంపుడుకత్తెనగు నాకంపునవి యని పద్దువ్రాయించితివా? నేను నీస్వాధీనమునందున్న ట్లేవార్తాపత్రిక యందైన ప్రచురించితివా? పదిసంవత్సరములనుండియు నన్నుంచు కొన్నట్లు దస్తావేజు లేమైన నున్నవా? అదిగాక చేతిమీఁదుగ దానమిచ్చినవస్తువు తిరిగి తనసొత్తెట్లగును?

వెంక—వారిజా ! ముందున్న పెన్నిధిని కాలదన్నుచుంటివిసుమా ?

వారి—వచ్చినదేమో రానేవచ్చినది. ఇఁక ముందురాదు. వచ్చినది పోదు.

వెంక—పొరబడుచుంటివిసుమా ? రేపు నేషనల్ బ్యాంకువారు వేలము వేయనున్న మోహనరావుని యాస్తినంతయు నీపేర పాటకొట్టి వేయించఁదలచితిని. మోహనరావుచే సంతకము చేయించిన నోటు ప్లెయింటుచేసి ఆతనిమీఁద వేలమువేయించి అదికూడ నీపేరనే కొనఁదలచితిని. పదియెకరముల మాగాణి బేరము జరుగుచున్నది. పదిదినములలో రిజిష్టరీ కాఁగలదు. అదియు నీకే. నినొక్క జమీందారిణిని జేయనెంచుచుండ..........

వారి—(తనలో) ఇదంతయు నిజమే యైనయెడల పెన్నిధిని కాలదన్నుటయే.

వెంక—కల్లబొల్లిమాటలు చెప్పుటకాదు. బాగుగా నాలోచించుకొనుము.

వారి—(నవ్వి) ఓయి తెలివితక్కువా! ఇది కళాశాస్త్రములో నొక ఘట్టము. వచ్చినతోడనే సరసకుఁజేర్చిన పటుత్వమేదీ? (అని కూర్చుండబెట్టి ముద్దిడును)

వెంక—అది నే నెరుంగుటకు నే నేమైన కళాశాస్త్రము జదివితినా?

వారి—అటులైన నిపుడు నేర్చుకొనుము (అని చెంపమీఁద మెల్లఁగ గొట్టును)

వెంక—నీచేయి యెంతచల్లగనున్నది? (అని చేయి ముద్దిడుకొనును)

[తెరలో తలుపుచప్పుడు. లోపల యెవరు అని కేక]

వారి—ఎవరది?

[లోపల]

మాటలాడవలసిన పనియున్నది.

వెంక—ఎవరది ?

వారి—ఎవరో, మీరు కొంచెము లోనికిపొండు. (వెంకటాద్రివు లోని కేగును.)

[వారిజ తలుపుతీయగా కృష్ణమూర్తి ప్రవేశించును]

కృష్ణ—మోహనరావు వచ్చెనా యిచటికి? (అని లోనికి జూచును)

వారి—అట్లు చూచెద రేమి? మోహనరా వెవరో నే నెరుగను. ఇచటకు రాలేదు. (అని లోనిక్కిబోవును)

కృష్ణ—ఆనిలిచియున్న దెవరు? మోహన్ రావు కాదు; వెంకటాద్రివు. వీడి దుంప తెగ. ఏమితుచ్ఛసౌఖ్యము? సౌందర్యరాశియగు భార్యయుండ వేషము తగిలించుకొనిన యీఉప్పరముండ చెంత పడియేడ్చుచున్నాఁడు.

గీ. రంభఁబోలు సతీపరీ♦రంభ ముడిగి
చెడిపెలం గూడి బ్రొందికి ♦ సేవఁజేయు
దుష్టుని స్నేహమ్ము యాడిన ♦ తోయజాక్షి
చింత లివి యున్న యంచని ♦ చెప్పఁదరమె?

ఇట్టి ద్రోహుల నఁదర తుండెములుగ నరికి కాకఘూకములకు సంతర్పణగావించిన పేరిపాపములు నశించుటయేగాక ప్రపంచముకూడ బాగుపడును. ఈవృథాకాలయాపన నాకేల? మోహానుని వెనుక బోయెదను.



## తృ తీ య ర ం గ ము

(వెంకటార్రావు గృహము : శాంత విచారముతోఁ
గూర్చుండియుండ తెరలేచును.)

అ ను బం ధ ము 12.

శాంత——

తే॥ గీ॥ మోహనాకారు డౌర యా♦ మోహనుండు
కమ్మలం గనఁడు పల్కఁడు ♦ కదలిరాఁడు
వ్యర్థమగుచుండె గోర్కె; లే♦వలన నాకు
ప్రాణములు నిల్చు నాతని ♦ ప్రాప్తులేక ?

ఏమిచేయుదును? జగన్మోహనాకారము నా కనులకుఁ గట్టినట్లుండెనే! తన నవకోటి మన్మధరూపము నొక్కసారి చూపిన చాలునంటినే! ఆ మృదుమధుర వాక్కు లొక్కపరి శ్రవణానందముగ వినిపించిన చాలునంటినే! ఇంతమాత్రమునకైన నోచుకొనలేదా? దైవమా! నాకేల యీ మాయమగనిం గట్టిపెట్టితివి? ఇట్టి సుందరాంగుని గూర్చియున్నచో నెంత మేలొనర్చియుందువు? ఒక్కక్షణ మింట నుండుటలేదు. రేయింబవళ్ళు త్రాగుడు, ఆపైని వేశ్యాసంపర్కము. గ్రహచారము చాలక యొకింతతడ వింటియందున్నచో పరుషవాక్యము లాడుట. అటేల చూచితివి; ఇటేలబోయితి వని యనుమానభూత మావహించి తిట్టిపోయును. ఇవియన్నియు చేతకాని వాజమ్మలకు లక్షణములు. నపుంసకునకు కోర్కెలు మెండు, అనుమానములు మెండు. భర్తకడ తగుసుఖము లభించుచున్న స్త్రీ యన్యపురుషసాంగత్యమేల యభిలషించును? అట్టిసుఖ మరుదగునప్పుడు అన్యులనే కోరు నెడల నిర్బంధించి యాపుట వీరికి సాధ్యమగునా? పోతవిగ్రహములవలె యిట్టివా రీ లోకమున నెందరుండిరో నావలె దుఃఖించుచున్న యువతు లెందరుగలరో? ఏది యెట్లున్నను మోహనునిపై గంపెడాశతో నుంటినే? నా కోర్కె తీరుట యెట్లు?

మోహన్—(ప్రవేశించి తనలో) సుందరాంగి దీర్ఘాలోచనాతత్పరయై కన్పట్టుచున్నది. కాదు; కాదు. విచారమునుసూచించుచున్నది. అందు నడుమ నడుమ కోరికె లీరికలెత్తుచున్నట్లు అస్పష్టవాక్యములుకూడ తొలుకాడుచున్నవి. ఆహా!

ఉ. దిద్దినముంగురుల్ నుదుటఁ ♦ దీర్చినకస్తురిబొట్టు కెంపునా
ముద్దులుగారు మోవి వల♦పుల్ వెదజల్లెడు మోముదమ్మి యా
యొద్దిక యామృదూక్తి కమ♦లోల్లసితామలనేత్ర వైభవం
బద్దిర యీపెసోయగ మ♦హా యనిపించదె యెంతవారికిన్?

ప్రథమసమావేశ మగుటచే యీమె నెట్లు పల్కరించవలయునో తోచకున్నది. ఇట్లుపక్రమించెదగాక! వెంకటాద్రివుగారున్నారా?

శాంత—(చూచి సంతోషముతో) ఎన్నిదినములకు దర్శనభాగ్యము లభించినది! దయచేయుఁడు. ఇంట లేరు.

మోహన్—అట్లైన దయచేయుట యెందులకు?

శాంత—స్వామీ! నన్నేల యింకను బరీక్షించెదరు? తమ దర్శనము నాకిఁక యీ జన్మకు లభింపదేమో యని దుఃఖించుచుంటిని. ఎన్నివార్త లంపినను రాకుంటచే నను జూడ నిచ్ఛగించుటలేదేమో యని కుమిలిపోవుచుంటిని. ఎట్లయినను నాకోర్కె నీడేర్చుమని భగవంతుని వేవిధముల ప్రార్థించుచుంటిని. ఆ పరమేశ్వరునికృప నాపై నిప్పటికి కలిగినది. మీకు నాపై నిప్పటికి కటాక్షము కలిగినది. రండు. కూర్చుండుఁడు. ఆలస్యమునకు భరింపఁజాల. ఒక్కసారి నీ బాహువల్లరులలో ననుఁ జేర్చినఁ జాలును. మృదుమధురవాక్కులతో శ్రవణపర్వముగ నోరార శాంతా యని పిలిచి నాశిరమును నిమురుచు నాచుబుకమును బుణుకుచు నాదండ నిలిచినఁ జాలును. (అని మోహనునిఁ గూర్చుండఁజేయును.)

మోహన్—శాంతా! నీప్రేమ మగణ్యమైనదని యీవరకే గ్రహించితిని. అది నీవంపిన వార్తలే ధృవపరచుచున్నవి. నాస్థితి యెట్లున్నదో యెఱుఁగుదువా?

అనుబంధము 13.

ఉ॥ ఓసుదతీ! యిటు ల్వ్రాను మఱపాో నినుఁ గాంచిన తొంటినాఁడె తా
నేసె ననఙ్గ మరుం డకట! యెన్నడు బొందుదు నిన్నటంచు నే
వాసిగ నెన్నొ దేవతల ♦ వాంఛలుదీర్పగ మ్రొక్కుచుండియుఙ్గ
గాసిలుచుంటి నేటి కది కైవసమయ్యె ముదంబు నొందితిఙ్గ.

శాంత—కాదు. మీరాసు ముదమందుటకాదు. నే ననుగ్రహింపఁబడి తిని. నాకోర్కి ఫలించుకాల మాసన్నమైనది. నాజన్మ ధన్యత నొందనున్నది.

మోహన్—బేలా! ఇంక తడవేల? రమ్ము. నిను బిగియార గౌగిలించి నా సంతాపముకూడ చల్లార్చుకొందును. (అని చెయిపట్టి తన ప్రక్కన గూర్చుచుండఁజేసి కౌగలించుకొనును.)

శాంత—నాజన్మ సార్థకమైనది. నామానసచోరులగు మీరు నాదండ కూర్చుండి మీ శరీరస్పర్శనము కలుగఁజేసితి రంతియచాలును. అమృతబిందువు లొల్కుస్వనముతో నను శాంతా యని పిలిచితి రంతియచాలును దురాత్ముఁడగు మన్మథుబాణాగ్నికి శలభము వలె మాడిపోవనున్న నాకు మీ గాఢాలింగన మను చందన మలందితి రంతియచాలు.

మోహన్—శాంతా! నీకే యననేల? నీమృదుహస్తపల్లవస్పర్శనము నన్ను నున్మత్తునిగా వించినది. నీకౌగిలింత నావంత తెల్లఁదీర్చి నది. కాని, నీకు పిచ్చిధోరణికిౘింద పడిపోవునట్లున్నది.

శాంత—నాది పిచ్చిధోరణియా? కాదు. ఈ యింట నేననుభవించు చున్న సుఖము లేదు. పరిణయమైనది మొదలింతవర కొక్క రాతిరైన భర్తృముఖ మెఱుగను. అట్టిచో నిట్టి సర్వాంగ సుందరునిపొత్తు లభించిన నామనం బెంత యానందాబ్ధి నోల లాడునో మీకెట్లు తెలియును? నాయట్టి స్థితి ననుభవించువారికే యది విదితమగును. ఏదీ, ఏదీ, ఒక్కముద్దు?

మోహన్—రమ్ము, నీముద్దునందలి రుచి యెంతయున్నదో చూడ నిమ్ము. (అని కౌగిలించి ముద్దిడును.)

శాంత—ఎంతమాధుర్యమైన ముద్దు!

ఉ. చక్కనిముద్దు యేవెలకు ♦ చాలనిముద్దు సదా తపించినన్
దక్కనిము ద్దహో యమృత ♦ ధారల నీనెడు ము ద్దోకింత నన్
జొక్కఁగఁజేయు ము ద్దోసగఁ♦జూడక వార్తల నెన్నిపంపినన్
జిక్కఁగఁబట్టి నీమనము ♦ జేరగరా కిటు జాగొనర్చితే?

మోహన్—శాంతా! ఇంకను భూతకాలమునే తలంచుచుంటివా? అట్లు రాకుండనుండుటకు హేతువు లేకపోలేదు!

ఉ. ఆరయ నాకుఁ గొత్తమగ♦నాండ్రను బొందుట నీదుభావ మే
తీరుననుండెనో యెఱుఁగఁ ♦ దెల్పితివో పలువార్తలంపి, మీ
వా రెపుడుందురో యెపుడు ♦ వచ్చిన నేమిఘటిల్లునో యిఁకే
దారియొ యంచుఁ జేసితి వి♦తర్కము, నూతనచోరు కైవడిన్.

శాంత—అంతటి సందిగ్ధావస్థ నొందవలసిన యగత్య మేమివచ్చినది? వార్తాహరు నడిగినఁ దెలిపియుండెడివాఁడే! అయినను మున్ముందుగ సమయాసమయముల నిర్ధరించి చెప్పకుండుట నాదియే పొరపాటు. అగుఁగాక, మనమిర్వుర మున్నసమయమున నాతఁడింటి కరుదెంచుగాక! ని న్నాంతని కంట బడనిత్తునా?

మోహన్—అకస్మాత్తుగ నరుదెంచిన నీవుమాత్ర మేమిచేయఁగలవు?

శాంత—ఎపుడువచ్చిననేమి, మిమ్ముల దాచుకొనలేనా?

ఉ. దాచెద నిన్ను గొత్రమ్ముడిని ♦ తావులనీనెడు పూలలోన నే
దాచెద నాశిరోజములు ♦ దట్టముగా నొనరించి మాటునన్
దాచెద నాహృదబ్జమున ♦ దాచెద నూత్నపుడిప్పలందునన్;
దాచదె కాళరాత్రి వడి ♦ దాకినఁ దేటిని దమ్మియెంతయున్?

మోహన్—శాంతా! నీవంతటిదానవే యగుదువు. (అని ముద్దిడి) ఆహా! ఈయధరసుధారస మాధుర్యమునకుతోడు మధువుగూడ నున్నచో నెంతటి యుత్సాహ మొదవియుండెడిది!

శాంత—అయ్యో! సమయమునకు లేకపోయినదే! సీసాలో నడుగున నేమాత్రమైన నుండిగీరును; గదిలోనున్నది పోవుదము, రండు. వలయుధనముకూడ నిచ్చెదను. తెప్పించుకొనవచ్చును. (అని చేయిపట్టి మోహనరావును లాగుకొనిపోవును)

వెంక—(కొంచె మాలస్యముగ) తలుపు - తలుపు (అని తలుపుతట్టును). (అంత తలగిరియబోసికొని శాంతయు వెనుక మోహనుడును ప్రవేశింతురు)

మోహన్—(మెల్లగ) ప్రమాదము! నీభర్తవచ్చినట్లున్నది. (అని గోడ దూకి పారిపోవును.)

శాంత—(చూచి) ఎంతసాహసము! గోడదుమికి పారిపోయెనే! దెబ్బ లేమియు తగులలేదుగదా? మునిగిపోయిన ట్లీతండుగూడ నిప్పుడే రావలయునా ?

(మరల తలుపు అని కేక)

శాంత—(జుట్టు ముడివైచికొని బట్టసర్దుకొని) వచ్చుచున్నాను. ఏమా తొందర? (అని పోయి తలుపుతీయును)

వెంక—తలుపుతీయుట కింతయాలస్య మెందులకు?

శాంత—నీళ్లుపోసికొనుచుంటిని. బట్టకట్టుకొని వచ్చునరి కాలస్యమైనది.

వెంక—వంటయైనదా? (అని సోఫాలో చతికిలబడి) ఈ కండువా యెవరిది?

శాంత—ఏమో? నాకేమి తెలియును?

వెంక—(తనలో) నాకొంపకుంగూడ యెసరుపెట్టెనాయేమి? (ప్రకా) నాకొఱకు మోహనరావు వచ్చెనా?

శాంత—లేదే?

వెంక—లేని దిదెట్లు వచ్చినది? ఈవస్త్రము మోహనరావుదే?

శాంత—నే నెఱుఁగనని చెప్పుటలేదా?

వెంక—నీవిషయమున నా కనుమానము వైచుచున్నది. నిజము చెప్పుము. మోహనుఁడు నీకడకు వచ్చియుండును.

శాంత—అవును. వచ్చియేయుండును. దొంగకు లోకులందరును దొంగలవలెనే కనబడుట సహజమే! అట్లే వ్యభిచారులకుఁగూడ నందరును వ్యభిచారులవలెనే కనఁబడుటయం దబ్బుర మేమున్నది?

వెంక—ఈ నక్కవినయములు నాకడ సాగవు.

శాంత—నావి నక్కవినయములా? చేసికొనినది మొదలొక్కదినమైన సుఖపెట్టకపోగా పైపెచ్చు రంకులు కట్టుటయా? అయినను మీరేయుప్పరముండచెంతనో పరుండి వచ్చుచుండుటలేదా? మీకు లేనితప్పు నాకేమి? మీవంటిశరీరము కాదా నాది? మీకువలయుసుఖము నాకుమాత్రి మక్కరలేదా? సిగ్గుపడి తలవంచుకొని యూరకొనక?

వెంక—ఆఁ ఊరకొనకా?

శాంత—ఇహసుఖము లందరికిని కావలసినవే. మీరు మడికట్టుకొని కూరుచుండి, నన్నన్నచో బాగుండును. నా గ్రిహచారమునకు నే నేడ్చుచు, నాకోర్కులు నా మనసుననే జీర్ణింపఁజేసికొని కుమిలిపోవుచుండ నెవరో వచ్చిరఁట! తన కనుమానమఁట!

వెంక—(తనలో) వ్యవహార మెదురుతిరిగినది. ఇఁక పరువునిలువదు. (ప్రికా) ఇంతకును నీ నెఱుఁగ వన్నమాట?

శాంత—ఎట్లెరుంగగలను?

వెంక—సరి, భోజనము పెట్టుము. పద?

శాంత—పెట్టెద రండు (అని చరచర నడచిపోవును)

వెంక—ఏమనుటకును వీలులేదు.



## చతుర్థరంగము

(మోహనరావు గృహము: సుశీల విచారముతోఁ గూర్చుండియుండును, శ్యామసుందర్ తల్లిచెంత కూర్చుండియుండును.)

అనుబంధము 14

సుశీల—

సీ. మోహనాకారు నా ♦ మోహాను నక్జేర్చి
కరుణజూపవె నిన్ను ♦ మరువకుండు
కన్నడబాసి, నా ♦ కాంతుని దుర్గుణ
ములబాపి, ప్రోవవే ♦ తలఁతు నిన్ను
సారంగనేత్రి, నా ♦ సారసాక్షుని నాదు
కన్నులఁజూపవే ♦ నిన్నుఁ గొలుతు
విమలాంగి శాంకరీ ♦ వెతుకంగ నాతండి
చనె విభు నాతనిఁ ♦ గనునో లేదో

తే. గీ. తోడితెచ్చునో గాంచఁగ ♦ నోడి విసివి
నీరసముజెంది తా నిలు♦జేరునేమొ?
దుర్గ భవభర్గ! వేగనా♦దువిభునింక
నిలయమునజేర్చి, మము కరు♦ణింపు మమ్మ.

హే జగన్మాతా! నీకన్న నాకిఁక వేరుదిక్కు లేదు. నీకృపారసంబు నాపై జిలుకకున్న నాగతియేమి? ఎన్నిదినంబు లిట్లు దుఃఖాంబుధిని మునింగి దరిగానక పరితపింతును? నామనోహరు నన్వేషింప నరిగిన మజ్జనకుండు కూడ రాలేదే! అతని యన్వేషణము ఫలించెనో, లేదో? దైవమా! యెట్లెరుంగనగును?

శ్యామసుం—అమ్మా! తాతయ్య నాన్నను తీసికొత్తా లంటివే! రాలేదేం?

సుశీల—అయ్యో తండ్రి! నాన్నగారికొరకు బెంగగొంటివా? బాబూ! తాతయ్య తీసికొనియే వచ్చును.

(అంత కృష్ణమూర్తి విన్నఁబోయిన మొగముతో ప్రవేశించును)

శ్యామసుం—తాతయ్యా నాన్న యేరి!

సుశీ—(ఆతురముతో) తండ్రీ! తండ్రీ! మీయల్లుడెచ్చట? తోడి తెచ్చితివా? కనుగొనఁగలిగితివా?

కృష్ణ—(బాలునెత్తుకొని) అమ్మాయీ! యేమిచెప్పుదును? నే జన్మించినదాదిగ నెన్నడును తత్ప్రాంతములనైన సంచరింప నిచ్చగింపని కల్లుపాకలన్నియు గాలించితిని. స్వప్నావస్థయందుఁగూడ కాలిడని సానికొంప లన్నియు గుమ్మరితిని. సత్రంబులన్నియు వెదకితిని. ఒకటి యననేల? ఊరంతయుదిమ్మరితిని. కాని యేమిప్రయోజనము? నా ప్రయాస మంతయు వృధయైనది.

సుశీ—హా దైవమా? (అని మూర్ఛిల్లును)

కృష్ణ—(గద్గదస్వరముతో) తల్లీ! దుఃఖింపకుము. లెమ్ము. ఓర్పువహింపుము.

సుశీ—(మెల్లగలేచి) జనకా! ఇఁక నెక్కడియోర్పు. ఇఁక నెచ్చటిపతి. వారింక గృహమును చేరుదు రనుటకల్ల, ఇంకేమున్నది. మామగారగు శంకరరావుగారి దురవస్థయే వారిపుత్రునకు సంభవించినది. అన్నపూర్ణాదేవిగారి దుర్గతియే వారికోడలనగు నాకును గల్గినది. కాని యత్తగారు తననాథుని యునికిని దెలిసికొని కడు నిడుమల బడి రంగూన్ జేరి ప్రభావతినికూడి సంచరించుచున్న పతినిగాంచియు విఫలమనోరథయై తుదకు విజయనగరమున తన జనకుండగు తులసీరావును, తన హృదయేశ్వరుఁడు తన కన్నులయెదుట హత్యగావింప నానేరము తనపై మోపుకొని ప్రాణేశ్వరుని రక్షకభటులబారి బడకుండ తప్పించి తన పాతివ్రత్యమును లోకమునకు వెల్లడింప పాపభూయిష్ఠంబగు నీమాయాప్రపంచమున తమవంటిసాధ్వీలుండఁగూడదనిసర్వేశ్వరు త్తరు వను మిషచే దివం బలంకరించిరి. ఈ మందభాగ్యరాలికాయోగ్యతకూడ నున్నట్లు తోచదు. ఎచటనుండెనో? యే దేశముల కేగెనో యెరుంగక యెట్లు వెన్నాడి యింటికి తోడ్కొనిరాగలను? నా బ్రతుకంతయు నడవిగాచిన వెన్నెల

యయ్యెనే ! తండ్రీ! మీ రేలవిచారించెదరు? నాకర్మమునకు మీ రేమి చేయఁగలరు? మీ కేల యీశ్రమ?

కృష్ణ—అమ్మా! ఎంతమాట పల్కితివి? శ్రమయా? తల్లీ! నా దుఃఖము నీవెఱుఁగవు. నీకన్న నిబ్బడిగ వాపోవుచుంటిని. ఏక మాత్రజనితవు. నీ దుఃఖము నే నోర్వఁగలనా? తనసంతానము దుఃఖములపాలైన సహించియూరకుండగల కఠినహృదయు డెందైనగలఁడా? నాదుఃఖమంతయు పైకుబకకుండ దిగమ్రింగు చుంటిని. పుత్రీ! నీ వొంటిగనున్నచో నీదుఃఖము నిన్నే దేని సాహసమునకు ప్రోత్సహించునేమో. ఇంటికి పోవుదము రమ్మా.

సుశీ—తండ్రీ! క్షమింపుము. నా హృదయేశ్వరుఁడు నాకనులకు సాక్షా త్కరించునంతవరకు నే నెచ్చటకును రాఁజాలను. ఇట్లు నిరీ క్షించుట నాకు విధి. ఇట్టి వియోగసమయంబున పుట్టినింట జేరి సుఖింపనెంచుట పతివ్రతాలక్షణమా? పరమదైవమగు పతి చెంత లేనప్పుడే సాధ్వి యితరగృహముల కేగ నిచ్ఛగించునా?

కృష్ణ—సుశీ! కన్నకడుపుగావున నిట్లంటినిగాని పతివ్రతాధర్మము తప్పు మని చెప్పునంత జ్ఞానహీనుడనా? కాని నీ వహర్నిశ లిట్లు దుఃఖింపకుము. నీ యదృష్టమే బాగున్నచో నీ పతి శీఘ్ర కాలముననే నినుఁ జేరఁగలఁడు. జ్యోతిష్కులఁగూడ విచారించి తిని. త్వరలో రాగలఁడనియే చెప్పిరి. నేనుగూడ నింకను వెత కెదను.

సుశీ—(ఆత్రముతో) చెప్పిరా? వత్తురని చెప్పిరా?

కృష్ణ—ఆ! నే నిఁక పోయివచ్చెదను. (అని బాలుని దించి) బాబూ! అమ్మదగ్గరకుపో! నే నిపుడే పోయివచ్చెదను.

సుశీ—జ్యోతిష్కులుకూడ చెప్పిరట. నావిభుఁడే గృహమున కేతెంచిన యెడల కనకదుర్గకు పసుపు కుంకుమ లిప్పించెదను. వేంకటేశ్వర స్వామికి గరుడోత్సవము చేయించెదను. గ్రామదేవతలకు బలి యన్న మొసంగెదను.

శ్యామసుం——అమ్మా, తాతయ్యచేతకాదు. నాన్నను నేను వెల్లి తీసుకొత్తాను.

తే. గీ. నాన్న యెందుండెనో చెప్పి ♦ నన్ను బంపు
అమ్మరో దెబ్బలోతెత్తు ♦ సుమ్ము నాన్న
నింటి కిటు చూడు నీకేల ♦ నింక నేడ్వ. (అని ఒకవైపుజూచి)
అడుగో నాన్న వచ్చుచునుండె ♦ నరయుమమ్మ.
(అని యెదురు పరుగెత్తును)

(మోహనరావు ప్రవేశించును. శ్యామసుందర్ తండ్రి నడుముపట్టుకొనును.)

సుశీ——(ఎదురేగి కాళ్ళపై బడి) హా! హృదయేశ్వరా! ఇన్ని దినంబులకు నాపై కృపగల్గినదా? మీ దర్శనభాగ్యము లభింపఁ జేయుమని వేయిదేవుళ్ళకు మొక్కుచుంటిని. ఉపవాసములు చేయుచుంటిని. అందులకు ప్రతిఫల మీశ్వరుఁడు మీ ముఖారవింద సందర్శనము గలుగంజేసె. శ్రమ నొందినట్లున్నది. ఇటు కూరుచుండుఁడు. మీ పాదము లొత్తెదను. వీవనచే నొకింత విసరెదను.

అనుబంధము 15.

మోహన——(కుమారుని విదిలించుకొని) యేమిటా ప్రోడ; వారిజ మాటాడుటే ముద్దుగా వుంటుంది. అసయ్యంగా మాటాడుటే అన లుండదు. తెలిసిందా?

సుశీ——(శ్యామసుందర్ కన్నీరు గార్చుచుండ దగ్గరకు దీసికొని) వారిజ యెవ్వరు? వేశ్యయా? అయ్యో! నాథా! వేశ్యాసాంగత్యము మంచిదియా?

మ. కన, మార్వాడి నటుండు వేశ్యయును జట్కాబండియాసామి యెందును నమ్మందగువారు కారనుచు విందుం బెద్ద లాడంగ; ముందు నయంబుల్ దుది ధార్త్యముల్ దమకు సొత్తంగాఁగ వర్తింతురీ ఘను లాత్మేశ్వర! వీరిపొత్తున మనల్ ♦ గాంక్షింతు రే త్యాదృశుల్?

మోహన—నీసీటులు వింట్రానికి యెవరూ రాలేదు. డ్రిబ్బు కావాల్సి డబ్బున వచ్చాను.

సుశీ—(తనలో) నేడు పూర్తిగ త్రాగినట్లున్నది. ఇంటనిలుపుట కష్టమే. ఏమిచేయుదును? (ప్రకా) నాథా! భోజనము పెట్టుదునా? లేక...

మోహన్—హాహాహాహా! నా కేమిఅక్కరలేదు. ప్టీం టక్కవయింది. డబ్బు.

సుశీ—ప్రభూ! మీ రెరుఁగనిధనము నాకడ నెచ్చటినుంచి వచ్చినది?

మోహన్—నీబాబుదగ్గర టీసుకోరా?

సుశీ—నాథా! నీయల్లుడు త్రాగుడునకు ధనముకావలయునని నే నడుగుదునా? అడిగిన నాతఁ డిచ్చునా? ఇంతకన్న నప్రతిష్ఠ యింకొకటి కలదా? నాథా! మీపాదము లంటి వేడెదను. ఈదురభ్యాసములను మానివేయుఁడు. న న్నుద్ధరింపుఁడు. మీశరీర మెంత శుష్కించిపోయినదో చూడుఁడు. మీముఖ మెంతవాడినదో చూడుఁడు. ఇదంతయు త్రాగుడుమహిమయే. అంతటి గౌరవకుటుంబమున బుట్టి యింతటి దురభ్యాసములకు లోనయ్యెనన్న యెంతటి యవమానమో యోజింపుఁడు.

మోహన్—నేను ట్రాగుటానని యెవడంట్రాడు? డ్రొక్కచించుటా. ట్రాగుడంటే నా కసహ్యం.

సుశీ—అసహ్యమంటిరికదా? ఇపు డేల త్రాగితిరి?

మోహన్—యిడి కల్లుకాదు, పారాకాడు, రిఫైన్డు విస్కీలో జిన్ మిక్చర్, (Refined whisky with zin mixture)

అనుబంధము 16.

సుశీ—అదిమాత్రము త్రాగుడుకాదా?

మోహన్—ఆడ్రిదాని కేం టెలుస్తుంది అందులో మజా? నోరుమూసుకొని డ్రిబ్బు టెచ్చి పెట్టు.

శ్యామసుం—నాన్నా! అమ్మదగ్గర రూపాయ ల్లేవు. నాకు తెలుసు.

మోహన్—(యేమిరా? అని కనులెఱ్ఱజేయును)

సుశీల—(పుత్రుని నోరుమూసి) హృదయేశ్వరా! న న్నేల బాధించె దరు? ఇంటియందున్న ధనమంతయు మీరే కర్చుపెట్టితిరిక దా! ఆభరణములుకూడ విక్రయించితిరి. ఇంకేమున్నదని యీయఁ గలను?

మోహన్—అడుగో! మెళ్ళో వేళ్లాట్టం లేదూ? యేమీలేవంట్రావేం?

సుశీ—(చెవులు మూసికొని) శివశివా! ఎంతటి యమంగళవాక్యంబు లుచ్చరించుచుంటిరి. జీవితేశ్వరా! ప్రాణపదంబగు మాంగల్య మిమ్మందురా?

మోహన్—పెంకెట్రినం చేస్తే "ప్రాణపదం ప్రాణాపాయం" చేస్తుంది. తెలుసుకో.

సుశీ—ప్రభూ! ఈదాసురాలిపై మీకంతటి యనుగ్రహమే కలిగిన నే వలదందునా?

మ. సతియైపుట్టి స్వకీయనిర్మలకులా◆చారంబు జేపట్టి సం
తతముఁ నిశ్చలభక్తి భర్తృపదని◆త్యధ్యానసేవాధి సం
గతయై నాథునిచేతిలో నసువు లే◆గం గల్గుటన్న ఁ పురా
కృతపుణ్యంబునగాక యూరక ప్రభూ! యెందేని జేకూరునే?

ఊఁ, కానిండు. నాప్రాణములును, మాంగల్యమును ఒకేపరి గైకొనుడు. (అని నమస్కరించుచు మోకాళ్ళపై కూర్చొనును.)

మోహన్—మొండిౕ. గజమొండి. (అని మంగళసూత్రము త్రెంపు కొని పోవుచుండ)

శ్యామసుం—నాన్నా! నాన్నా! పోకుపోకు. (అని పట్టుకొనును)

సుశీ—(మోహనరావు చేతినిపట్టుకొని) అయ్యో! అయ్యో! నాథా! ఇది మీ కశుభము. పోకుఁడు పోకుఁడు. (అని వెంట నంటు

చుండగా మోహనుఁడు చేయివిదిలించి శ్యామసుందరు నొక ప్రక్కకు ద్రోసి లేచిపోవును)

సుశీ—(క్రిందపడి లేచి దుఃఖముతో పుత్రుని దరికి దీసికొని) దైవమా! యెంత ఘోరము! యెంతటి యధఃపతనము! మంగళసూత్రము నకు పాల్పడుట. అహా యింకనా కేల యీజన్మ? ధవుని ప్రేమాతి శయములకు దూరమై యాత్మేశ్వరుని చరణదాస్యమునకునోచు కొనక మోడువలె జీవించుటకన్న నాత్మహత్య చేసికొనుట మేలు. ఆఁ.ఆఁ. అట్లొనర్చిన నీనేర మాత్మేశ్వరుపై మోప బడదా ? అత్తగారగు నన్నపూర్ణాదేవిగారు పతిప్రాణరక్షణా ర్థమై తన ప్రాణముల నర్పించినది. ఆమె కోడలనగు నేనాత్మ హత్య గావించుకొని పతికి ప్రాణాపాయస్థితి దెచ్చుటయా? తలిదండ్రుల నిర్వ్యరము నగుపడకున్న బాలుడు గుండెపీలడా? శిశుహంత్రినిగూడ కావలయునా ? ఆత్మహత్య మహాపాతకము గాదా? అయ్యో యిదేటియూహ? ఓసీ మద్యపిశాచమా! బ్రాందీ బ్రహ్మరాక్షసీ! నీ వేదేశమున జన్మించితివో యేదేశమున వృద్ధినందితివో యాదేశముననే నశింపక ఆదేశమున కారువేల మైళ్ళదూరమున నున్న మాభారతభూమి నాక్రమించి భారత వీరుల వరించి మహామారివై కాలకూటమువై పురాణజ్వర మువై దేశమునందలి ధనమంతయు కొల్లగొట్టుచు గౌరవముల మాపివైచి సంసారముల కూల్చివైచి, మిక్కుటమగు హత్యల గావించుచు క్షయవ్యాధివలె మానవుల పీల్చి పిప్పిజేసి నశింప జేసి లోకమంతయు ధ్వంసము చేయుచుంటివే ! అట్టినిన్ను మా భారతపుత్రులు గుడ్డివారై సేవించుచుండిరే. బాలింతలకు బ్రాంది, సూతికావాతమునకు బ్రాంది. సన్నిపాతమునకు బ్రాంది. వైద్యులకు జీవనోపాధి బ్రాంది. ప్రజలకు మారణో

పాధి బాధించి. దేశమంతయు బాధించియయమయిపోయిన దే! ఇంక మా దేశ మాహాన్నత్యము వహించునా? చివరకు మాంగల్యముకూడా హరింపజేసే ప్రభావము బాధించియుం దున్నదిగదా? హా యేమి నాఘోరణి. నాగతికి నేను దుఃఖింపక నా కీయవివేక మేమి? అయ్యో మరచితిని. మాంగల్యశేషనై యుండదగునా? పోయి పసుపుకొమ్మైన కట్టుకొనెద.

అనుబంధము 17,

(పుత్రునితో) తండ్రీ! దుఃఖింపకుము మీతండ్రిగారికి మనపై నింకను కృపకలుగలేదు.



# రంగూన్ మెయిల్

## పంచమాంకము



### ప్రథమరంగము

[వేశ్యగృహము: మోహనరావొంటిగ కూరుచుండియుండ,
తెర లేచును.]

అనుబంధము 18.

మోహన్—ముస్తాబైనపుడు రంభయో దాని తల దన్నినదియో యనిపించును. కాని దీనికన్న నలుకుపిడచ నయము. దాని చేతిమీఁదుగ నొసంగు పానీయముమాత్రము అమరులును అసురులును పోరాడిచచ్చుటకు కారణమైన యమృతముకన్న రుచిగ నుండును. ఇది యిచ్చుటయేయననేల? సరససల్లాపములకు తగిన యే చపలాక్షి యొసంగినను అంతరుచి యుండితీరును. శాంత యొసంగినప్పుడుమాత్రము మారుచి తగ్గినదా? కాని యింకొక విశేషము. అచటికేగిన దొంగవలె చరింపవలయును. ఇచటనో నిర్భీతిగ నిరాటంకముగ సంచరింపవచ్చును. ఇదియే వెలిచవులు గనిన మగనాలికిని వేశ్యలకునుగల తారతమ్యము. దీనికి నెలతప్పి మూడవమాసము. గర్భస్థశిశువు నాకు వారసుఁడు కాఁడుగదా? ఆఁ. నాకున్న దేమి? వారసుఁడై యాతఁడు చేయునదేమి?

వారి—(ప్రవేశించి) ఏమో ఆలోచించుచున్నట్లున్నది?

మోహ—ఆలోచన యేమున్నది? నీవు క్షణము నాచెంత లేకున్న పిచ్చియెత్తినట్లుండును. కూర్చుండుము. ఈపూట ముస్తాబు మారినదేమి?

వారి—నీ దృష్టి మారినదిగాని నామనస్తాబు మారలేదు.

మోహ—ఎందులకు మారలేదు?

సీ॥ మెలికలు తిరిగి నిగ్ • మేలంబులాడెడు
ముంగురులకు నల్ల • రంగు లేదు
నును చెక్కిళులపైన • కనబడ దొక్కింత
తళతళ తళుకును • దాల్పకుంట
యధరంబుపైనను • నమర దెఱ్ఱనికాంతి
తములంబు వేయక • తనరియుంట
జలజలలాడవు • చెవులకు లోలకుల్
దాల్పక కమ్మల • దాల్చియుంట

తే. గీ. విరులదండలతోడుత • విఱ్ఱవీగ
దకట క్రీజెడ కొప్పును • దాల్చియుంట
సుంత ఫేస్ పౌడరును దాల్ప • సొగసుదోచు
చున్నది మొగంబుమాత్రము • కన్నుగవకు.

వారిజ—నీ యుపన్యాసమంతయు నే నందగత్తెను కానని యేనా?

మోహ—అబ్బే, అది కాదు. ఇది యొక విధమగు వర్ణనము. అందగత్తెవు కానియెడల మొగము సొగసుగ నున్న దన నేల?

వారి—ఆ మాట చెంపపగులగొట్టి క్షమించుమన్నట్లున్నది. అవన్నియు వేషధారుల కన్వయించును. ఇదేమి నాటకమా?

మోహ—ఇదే యననేల? ప్రపంచమంతయు నాటకమే. భూమియే రంగస్థలము. జనులందరును వేషధారులు.

వారి—అందు నాది పెద్దవేషము. అంతియేనా? ఇట్టి పగటివేషముతో నిన్నినాళ్ళనుండియు నెట్లు సుఖించుచుంటివి?

మోహ—గుడ్డివాఁడనై, ఇదిగో యీగ్లాసు మైకముచేత. (అని త్రాగును)

వారి—అప్పటినుండి యెవరితోఁ గూడి యెట్టి సుఖము లెయ్యని యనుభవించుచుంటివి?

మోహ—నీ వెవరితోఁ దత్సుఖముల్లైవని యనుభవించుచుంటివో యిది

కూడ యట్లే మెంచి తాగుచుంటిని. హాహాహాహాహా. ఇంకో సీసా తీసుకురా. (అని సీసానెత్తి తాగును)

వారి—తెచ్చియిచ్చెదను. ఇచట తేరసా మ్మెవరిదియు లేదు.

మోహా—ఆఁడముండవు, జాగ్రత. మర్యాదగ తెచ్చియిమ్ము.

వారి—కొట్టెదవా?

మోహా—కొట్టుట కాదు; కాలిక్రింద మట్టగించెదను.

వారి—నోరుమూయుము. (అని కనుబెట్టుజేయును)

మోహా—(జుట్టుపట్టుకొని) నోరు మూయాలా? (అని కొట్టును)

వారి—అమ్మయ్యో; యీదుర్మార్గుఁడు నన్ను చంపుచున్నాఁడు. రండప్పో!

మోహా—దుర్మార్గుఁడనా? ఎవరొస్తారు నీ మొగుళ్ళు? (అని కాలు సేతుల తన్ని నిష్క్రమించును)

వారి—అయ్యయ్యో; తుచ్ఛుఁడు ఎంతపనిచేసెను! శిరోజములన్నియు నూడినవి. ఓయి భగవంతుఁడా! ఈదురాత్మునిపొందు నాకేల కూర్చితివి? అయ్యో! యెముకలన్నియు విరిగినవి. లోకమున వ్యభిచారిణిపా ట్లింతకన్న నెక్కుడుగ నెట్లుండును? ఛీ! యేల యీవేశ్యజన్మ?

చ. పతియనువాఁడు లేక యిటు♦పందల చోరుల తాగుబోతులన్
సతతము గూడుచుండువ్యభి♦చారిణి నొక్కఁడు తిట్టు తన్ను నీ
గతి నొక డూయు నొక్కఁడు మొ♦గంబున; జంతువులట్ల కొంక కీ
గతిని జరించుచుండు వెల♦కామినిజన్మ మదేల, కాల్చనే?

అబ్బా, అయ్యో! నొప్పులు. (బాధ నభినయించును)

[అంత వెంకటాద్రివు రాజారాములు ప్రవేశింతురు]

వెంక—వారిజా! యీవేషమేమి? అట్లతెల్లబోయి చూచెదవేమి?

వారిజ—ఏమున్నది? నీప్రసాదమే.

వెంక—ఏమి, నేనేమిచేసితిని?

వారిజ—ఏమిచేసితినని కాదు, యేమిచేయలేదనుము.

ఉ. ఉంచితి వీవు నన్ను ధన♦మూడ్చి పకీరుని జేయనెంచి 'తా
గించి వశుండుగాగ పలు♦గ్రీడల దేల్చు'మటంచు నాకు బో
ధించి దురాత్ము నాదెసను♦దింపితి తార్పుడుగాని బోలె; బా
ధించెను, తన్నె నన్నతఁడు ♦ తెంపరి పాపము రిత్తపోవునే?

ఇందులకు కారకులెవరు? అది యట్లుంచి భ్రూణహత్యకూడ జరిగినదేమో?

రాజా— అదేమి ?

వారి—ఏమున్నది ! ఇప్పుడు మూఁడవమాసము.

వెంక—ఓరీ తుచ్ఛుఁడా ! మోహన్‌రావూ ! నీ కింక ప్రపంచమున పుట్టగతు లుండునా ? ఆరునెలలు సామొనర్చి మూలనున్న ముసలమ్మను కొట్టినన్న ట్లీమెనా కొట్టితివి ? నావంటివానితో కలియఁబడిన నీప్రతాపము బయలుపడెడిది.

వారి—ఏమూవాక్చూరత; మేకపోతుగాంభీర్యము !

వెంక—వారిజా ! ఏమంటివి? నాది వాక్చూరతయా ? మేకపోతు గాంభీర్యమా ? కాదు. కాదు పొరబడుచుంటివి. ఇట్టివిషయము లలో ఈ హృదయమున కనికర మనునది లేదు. పాపపుణ్య విచక్షణత లేదు. అధైర్య మనునది యీ జన్మమునకే లేదు. నే జనించినదాది ఒకరిని మోసగించితినిగాని, యొకరిచే మోస గింపఁబడి యెఱుఁగను; అనేకుల ధ్వంస మొనర్చితినిగాని, నే నట్లు కాలేదు. ఎందరినో చావమోదితినిగాని యొకరిచే దెబ్బలు తిని యెరుగను. నా రక్తనాళములన్నియు కాలకూటముతో నిండి యున్నవి. పూర్ణభావముతో యీ నాహస్త మెవరిపై నిడినను నా హస్తరక్తనాళముల మార్గమున విషమంతయు వారల నావేశించి సర్వనాశన మొనర్పకమానదు. ఈ తుచ్ఛుని సర్వ నాశన మొనర్పవలయుననియే నాసంకల్పము. చేయగలను, చేయుచుంటిని, చేసెదను. ఆతనియాస్తి యంతయు బ్యాంకు వేలములో నేనే పాడితిని. నీపేరనే పాటకొట్టివేయించితిని. నీ

వాతనిచే సంతకము చేయించిన నోటు ప్లెయింటుచేసితిని. దానితో నాతనిమేడకూడ వేలము వేయించి నీపేరనే కొనెదను. రాజారాం! నీ వొకపని చేయవలయును.

రాజా—సిద్ధముగ నుంటిని.

వెంక—(చెవిలో రహస్యము చెప్పి) అట్లు తప్పక చేసితీరవలెను. కుక్క కాటుకు చెప్పుదెబ్బ. అపుడుగాని నామనస్సు శాంతింపదు.

రాజా—అందుకు నే నీవరకే ప్రయత్నము మొదలిడితిని. తొలుత మన మాతనియింటి కరిగినప్పు డామెను జూచి నే కనుగీటుటయు అందుల కంగీకారసూచకముగ నామె మౌనము వహించుటయు సంభవించినది. తదుపరి నాయభిప్రాయముగూడ నెరింగించితిని. ఇంకొకపరి ప్రయత్నించినచో............

వెంక—అట్లైన ఇంక నేమి? సిద్ధసంకల్పుల మన్నమాటయే. మరి మెప్పు డు పోయి......

రాజా—తొలుత మల్లివిషయము పూర్తిచేసుకొని.

వెంక—వారిజా! ఇంక ధైర్య మవలంబించియుండుము. మోహనరావును నీమనసునకు నచ్చునట్లు నీకసితీరునట్లు చేసెదము. నీచేత మోహనరావుపై ఛార్జి నిప్పించెదను.

వారి—అది యట్లుంచుము. నేడు మొదలు నన్ను నీభార్యవలె భావించి చరింతునని వాగ్దత్త మిచ్చినగాని యికముందు మనస్నేహము పొసగదు.

వెంక—అంతకన్న నెక్కుడుగ జూచుకొందును. పడకపై పరుందువు గాని పద.

వారి—అబ్బో బాధ! మెల్లగ పట్టుకొనుము. (అని లేచుచుండ తెర పడును)

## ద్వితీయ రంగము

(బయలుస్థలము: చెట్టుక్రింద మల్లి విచారముతో కూర్చుండియుండును)

అనుబంధము 19.

మల్లి—బగమంతుడా యెన్నాలీగాచారం? చానాన్నాలాయె. యీ చెట్టు కాడ పడుంటిని. నాసామి కెన్నాలకీ నామీద దయరాక మోాయె. యేంది సెయ్యటం? యీనంజకొడుకు ఇయ్యా లొత్తాడుమల్లీ. ఆమాట తల్సుకుంటే బయమేత్తోంది. కుట్టమూర్తయ్యగారు కూడ మా దేవుడుతో నన్నేలుకోమని సెపుతానన్నారు. యే మయింది తెల్దు. నాసాయి యేమన్నాడో తెల్దు. నా గతెలా వుందో తెల్దు. (ఆలోచించి) ఇయ్యాల డబ్బట్టుకొత్తాడు కామాల. మెల్లగా డబ్బుకాజేసి వోరన్నాదొర్లముంద రెట్టి రాజారాంగాడికి బుద్దిసెప్పిచ్చకమోాతే నన్ను బతకనీడు.

(వెంకడు ప్రవేశించును)

వెంక—ఇయ్యాల వోయిదా. యేదో తేల్చుకోవాల. అరుగో కుట్ట మూర్తిగారుకూడా వొత్తుండారు. యీాడ దాకుంటాం. (అని దాగును).

కృష్ణ—(ప్రవేశించి) అదే వెంక డచ్చట దాగినట్లున్నది. (అని తాను గూడ దాగును)

మల్లి—అచలు మొగుడొల్లనోళ్ళబతు కెందుకు? యెందులోఅన్నా పడి సత్తే కట్టాలన్నీ వొక్కమాలి పోత్తై. యీాడిజిమ్మడ; వొత్తుండాడు.

(అంత రాజారాం ప్రవేశించును)

రాజా—నేటితో నాయాశ నిరాశయగుటయో లేక కృతకృత్యుడ నగుటయో తేలిపోవును (అని మల్లిచెంతకు జేరి) మల్లీ! యేమినిశ్చయించితివి?

మల్లి—యేందయ్యా నిశ్చయించేదీ?

రాజా—నాపంచప్రాణములు నీవేనని నమ్మికొనియున్న నాకోర్కె తీర్చవా? ఇదిగో కావలయునన్న ధనముకూడ తెచ్చితిని, ఇదిగో. (అని చూపించును)

మల్లి—నాకోసమేనా! యిటు తే.

వెంక — చూసిండ్రా దొరగోరూ! డబ్బీమంటోంది.

కృష్ణ—ఆ మనిషి యేయుద్దేశ్యముతో నిమ్మనుచున్నదో తొందరజెందక చూచు చుందుము.

రాజా—(ఆలోచించి) ముందుగ నాకోర.........

మల్లి—అంత నమ్మకంలేనోడివి నువ్వేం యిత్తావు? నేనేం తీచుకుంటాను?

రాజా—అబ్బే నమ్మకంలేక కాదు ఇదిగో తీసికొనుము. (అని నోట్లిచ్చి దగ్గర జేరుచుండును)

మల్లి—(తీసికొని) దగ్గరకొత్తావేం గూరంగుండు. డబ్బుతీసుకొని వొప్పుకోనానికి నేనేం బోగందాన్ననుకున్నావా?

కృష్ణ—వెంకా! చూచితివా? యింకనూ కొంచె మోపికపట్టు.

రాజా—(తెల్లబోయి) అయిన యీధనము తీసికొనుటలో నీయుద్దేశమేమి?

మల్లి—నీ కేం వుద్దేశంకావాల? పెద్దమడుసులముందెట్టి నీకు బుద్ది సెప్పించడమే వుద్దేశం.

కృష్ణ—వెంకా! యిపుడు గ్రహించితివా?

వెంక—ఉండుదొరా! మాట్టాడకండి

రాజారాం—మల్లీ! బాగుగ ఆలోచించుకొని మాటాడుము. నీచే మోసగింపబడుటకు రాజారాం అంత మూఢుఁడు కాఁడు. ఆ ధనము మరల లాగుకొని తగినశాస్తి చేయకపోఁడు.

మల్లి—నేకమొంతే లోకంలో వోరిపెళ్ళాలు సొగ్గావుండారయ్యా? నువ్వు చాత్తిచేత్తే చూత్తూవూరుకోటానికి? లోకం గొడ్డుమోయిందా! అంతా నీలాంటోళ్ళే వుండారా?

రాజారాం—ఇచ్చేదవా లేదా ? (అని కనులెఱ్ఱచేసి కొంచెము దగ్గరగా బోవును.)

మల్లి—కళ్ళెఱ్ఱచేత్తే దడుత్తా ననుకుంటుండావా ? నే నీను. వోరితో చెప్పుకుంటావో చెప్పుకో పో. మీాది కొత్తుండవే ? యేమండో! ఓదొర్లూ ! యీా నంజకొడుకు నామానం పానం తీత్తాడంట రచ్చించండి.

రాజారాం—ఎవరు రక్షింతురో చూతును. (అని మీాదకుబోయి జుట్టు పట్టుకొనబోవుచుండ మల్లి తప్పించుకొనుచుండును. వెంకడు పరుగెత్తుకొనివచ్చి)

వెంక—నంజకొడకో! దాన్ని ముట్టుకోటం నీశా తౌొద్దంటరా ?

(అని క్రిందపడవైచి చావమోదుచుండును.)

కృష్ణ—బాగుగ మర్దించుము. ఆఁ ఆఁ చాలుచాలు. ప్రాణాపాయము జరుగగలదు.

వెంక—పో నంజకొడకా! పో. (అని తన్నును).

రాజా—(దులుపుకొనుచు లేచిపోవును).

కృష్ణ—ఇట్టి తుచ్ఛులగతు లింతకన్న నెక్కుడుగ నెట్లుండును? వెంకా!

మల్లి—(కన్నీరు తుడిచికొనుచు నిలిచియుండును).

వెంక—(గుటకలు మ్రింగుచు) దొరా !

కృష్ణ—చూచితివా ? గ్రహించితివా ? అనుమానభూతమును నీ మనమునుండి పారదోలితివా ?

చ. కడు సుకుమారి రూపజిత ♦ కాంతలకుర్కు తలమానికంబు తా
నుడుగక యిట్టికష్టముల♦కోర్చియు నాధుడె దైవమంచు గొ
ల్చెడు; నడిగో కనుంగొనుము ♦ చేలచెరంగున కండ్లనద్ది, యే
డ్చెడు నుపవాసముల్ సలిపి♦ చేడె యరుంధతియంత సాధ్వియౌ.

ఇంతకాదు, ఇఁక నిన్నికష్టములు రానిమ్ము, ఆ మానస మేమాత్రమును చలింపదు.

ఉ. ఇట్టిపతివ్రతాతిలక♦మెచ్చుట నేగతి నెన్నినాళ్ళు చే
పట్టినవానికై మొగము♦వాచి తపించుచునుండుగా గౌరుల్
ముట్టగ శక్తులే యెటుల ♦ మోనమొనర్చిన ద్రవ్యమిచ్చినన్
పట్టునె యెట్టిపట్టునను ♦ పావకునిన్ జెదపుర్వు లుర్విపై.

మల్లి—నిజం దేవుడా! నిజం నే నేపాపం యెరుగను (అని కాళ్ళమీఁద పడును)

వెంక—(లేవదీసి) నామల్లా! నెగు. నిన్ను చాలా అన్నేలమే చేశాను. (అని బుజ్జగించును)

కృష్ణ—వెంకడూ! నీ కీగతి కలుగుటకు కారణ మిప్పటికైన గ్రహించితివా?

ఉ. త్రాగుడె నిన్ను వారలకు ♦ దాసునిగా నొనరించివైచె, నీ
త్రాగుడె వారివాక్యములె ♦ తథ్యములంచనినమ్మఁజేసె, నీ
త్రాగుడె యిట్టుమీాయనుఁగు♦దంపతులన్ విడదీసె,నయ్యొ యీ
త్రాగుడు చేయలేనిదురి♦తంబులు లేవిల నెంతవారికిన్.

వెంక—దొరా! నాగుడ్డితనమంతా పోగొట్టి నాకొంప నిలిపింతురి. మీకు దణ్ణమెడతా. మీదాసుణ్ణి.

కృష్ణ—వెంకడూ! యిందు నేను నిమిత్తమాత్రుఁడను. మీసతీపతుల గలిపి మీసంసారము నిలిపినది నీభార్యపాతివ్రత్యప్రభావమే. మల్లీ! యిటురమ్ము. నేను నాచేతిమీఁదుగ మీ యిర్వురిచేతుల గలిపెదను. (అని చేయిజాచును.)

మల్లి—దొరా! నన్నంటుకుంటూరా?

వెంక—బాబూ! మేం మాలోళ్ళం. అంటుకుంటే మాకే పాపం.

కృష్ణ—పిచ్చివాఁడా! పాపమెందులకు? మీరు మాలలా?

ఉ. మాలలు మాలలంచు పలు♦మారు వచించెదు మందబుద్ధులే
మాలలు, పాపపుణ్యముల♦మాట జెవిన్ జొరనీనివారె పెన్
మాలలు, జారచోరులయి ♦ మత్తుగ త్రాగెడువారె మాలలన్
మాలలు, ఇంతె కాక యిఁక♦మాలకులం బొక టేది యిద్ధరన్?

ఇఁక నగ్రిజన్ముఁ డెవఁడందువా ?

ఉ. జాలిదలంచు సజ్జనుఁడు ♦ సత్యవచోనిధి శాంతమూర్తియుఁ
చాలఁగ భక్తితత్పరుఁడు ♦ సర్వమునుఁ సమదృష్టి జూచు స
చ్ఛీలుఁడె యగ్రిజన్ముఁడగు ♦ చింతిల నిట్టిగుణంబులందునఁ
బోలనివాఁడె మాల, తల♦పోయగ మాలకులం బిఁకే దిలఁ ?

నీ విదివరకు మాలవేకాని యిపుడు మాత్రముకాదు. నిన్ను మాలగాఁజేసిన నీ హృదయమాలిన్య మంతయు తొలగిపోయినది. అనుమానించక మీహస్తము లిటు తెండు. (అని యిర్వురి చేతులను కలిపి) వెంకా! ఇఁక నెప్పటికిని త్రాగననియు నీభార్య నిఁక నెన్నటికిని వీడననియు ప్రమాణ మొనర్పుము.

వెంక—ఇంకా తాగటవేఁ దొరా! తాగడంమూలాన్ని యింత గాశారం కలిగిందని తెలిశాక యింకా తాగుతానా? మీపాదాలతోడు నా పెళ్లాన్నెప్పుడూ యిడిచిపెట్టను.

కృష్ణ—పరమానందము నొందితిని. పుణ్యదంపతులారా! నే నిఁక పోయివచ్చెదను (అని నిష్క్రమించును.)

వెంక—(మల్లివంక చూచి) యేంపిల్లా!

మల్లి—యేం పిల్లగా ?

వెంక—యేమంటావు ?

మల్లి—మనగుడిశకాడ యెన్నెలంతా వూరికే పోతోందంటా, పోదాం పదమంటా, కుశాల గుందామంటా ?

వెంక—చ రే రమ్మంటా (అని ముద్దుపెట్టుకొని నిష్క్రమింతురు.)



## తృతీయరంగము

(మోహనరావుగృహము : సుశీల, కృష్ణమూర్తి, శ్యామసుందర్)

కృష్ణ—(శ్యామసుందరుని దగ్గర నుంచుకొని) కుమారీ! యేల విరక్తి నొందెదవు?

ఉ. కష్టసుఖంబులన్ గనఁగ • కావడికుండలు గావె, ముందటన్
దుష్టులుగాఁ జెలంగి తుది•దుర్నయముల్ విడుచుందు రెందరో,
నష్టము గల్గుగాక మరు•నాఁ డిఁక లాభమురాదె, గాఢమై
దృష్టి నడంచు మేఘతతి•యేఁగదె గాలికి దూది తున్కలై.

సుశీ—తండ్రీ! మీరు వ్రాసిచ్చినది సత్యమే కాని, యిచ్చటమాత్రి మట్టి సూచన గోచరించుటలేదు.

కృష్ణ—అమ్మాయీ! త్రాగుబోతునకు త్రాగుబోతు స్నేహము. వెంకట్రావుస్నేహ మున్నన్నిదినములు నీతఁడు మార్గమునకు వచ్చుననుట కల్ల. అతఁడు వీని సర్వనాశనము చేయువరకు విడువఁడు. గ్రహచారము చాలక వెంకట్రావు వీతని కగపడక త్రాగుడునకు ధనము దొరుకక యున్నచో నింటి కధుదెంచి యేదియో యొకటి లంకించుకొనిపోయి విక్రయించి త్రాగు చుండును. అమ్మా! నీ వెంత దాచినను ఆతని చర్యలన్నియు నే గ్రహింపలేకపోలేదు. నీ గళమున పసుపుకొమ్ములు కట్టు కొనినది కూడ నెరుఁగుదును. తల్లీ! వెంకట్రావు మీ వ్యవహారము లన్నియు చక్కబెట్టి మీ యాస్తి మీ కిచ్చివేయు నని చెప్పితిరే? ఆతఁ డట్టి సద్భావముతోడనే యున్నచో వేలములో మీ యాస్తి యంతయు తన యుంపుడుకత్తెయగు వారిజ పేర నేల కొట్టివేయించును? గోడకువేసిన సున్నము, వేశ్య కిచ్చిన సొత్తును తిరిగి వచ్చునా? వేలము మాత్రి మింకను ఖాయపరచలేదు.

సుశీ—ఆ స్త్రీకొరకు నేనేడ్చుటలేదు. నాధుని.. ......

(అని యనుచుండ, మోహనరావు ప్రవేశింప శ్యామసుందర్ చెంతకు పోవును, మోహనుడు పుత్రుని నావలకు నెట్టి)

మోహ—తండ్రిగారు తేదియో దీర్ఘాలోచన మొనర్చుచున్న ట్లున్నది.

కృష్ణ—వే రాలోచన కేమున్నది? అంతయు నిన్నుఁ గూర్చిన యాలోచనమే.

మోహ—నన్నుఁగూర్చి యింతశ్రమపడి యాలోచించవలసిన యవసరమేమివచ్చినది?

కృష్ణ—ఏమివచ్చిన దనికాదు. ఏమిరాలే దనుము. మోహనా! యీవరకు నేనెన్ని పర్యాయములో యెన్నివిధములనో వెంకటాద్రిపుమైత్రి మంచిది కాదని బోధించితిని. నావాక్యములు పెడచెవిని బెట్టితివి. ఇప్పటికైనను నామాట వినుము. వేశ్యా సాంగత్యము మంచిదా? వారాంగనల నమ్మవచ్చునా?

ఉ. వంచనసేయులే తనదు ♦ పాండితిగా నెదనెంచి ద్రవ్య మా
ర్జించుచు, నిన్నుఁబోలు విట♦శేఖరులన్ గడె కొక్కవాని గా
మించెడు వారకాంతను ద♦మిం భజియించెదు, మంచిమాటలా
లించవు, మానహానికి జ♦లించవు మోహ మవెంతగుడ్డిదో.

మోహ—అవును. మీమాట యేల కాదనవలయును? మోహము గ్రుడ్డిదే. అందువలననే యీ దోషము నాదికాదు.

కృష్ణ—అటులనా? సరే. అది నీదోషము కాదంటివి. ఈ త్రాగుడో?

మోహన్—త్రాగుడువలన నేమితప్పున్నది? మనోల్లాసముకొరకందరును త్రాగవచ్చును.

శ్యామసుం—నాన్నా! తాగటం మానెయ్యవూ? అమ్మా నేను నీకోసం యేడుస్తూవుంటే మాదగ్గిర వుండకుండా పోతున్నావేం? మా గతి యింతేనా? నాన్నా! నా కోసం యింట్లో వుండవూ? నా మాట వినవూ?

మోహ—ఛీ! శుంఠా! నోరు మూయుము. నాకు కాదు. త్రాగుమని మీ తాతకు చెప్పుము.

కృష్ణ—త్రాగి మీరు భ్రష్టులగుచున్నదిచాలక యందరును త్రాగ వచ్చునని చెప్పుచుంటివా? మోహనా! త్రాగుడువలన గలుగు కష్టనష్టముల నించుకయైన విచారింపవైతివే? ఇంతకన్న ఘోర నరక మింకొకటి యున్నదా?

ఉ. గౌరవ మూడ్చివైచు, కుల ♦ కాంతను రోయఁగఁజేయు, బంధులన్
దూర మొనర్చు, ద్రవ్యమును ♦ దోఁచి బికారినిజేయుఁ, జోరులన్
జేరుచు, దుంపఁజేయుఁ దన ♦ చిన్నికుమారునినైన, బంపెడున్
కారకునైత, మింక నర♦కం బెది త్రాగుడుకన్న నిద్ధరన్.

మోహన్—ఇదంతయు నబద్ధము.

కృష్ణ—అబద్ధమా? అంతటితో విడచినఁజాలు.

ఉ. చేరగనీరు సజ్జనులు ♦ చెంతకు, పిన్నలు నన్యవంశజుల్
దూరగఁజొత్తురెంతయు న♦ధోగతిఁగూర్చును బ్రాందిమొందునన్
మారిమె శల్యమౌ గతిని ♦ మానిసి బీలిచి పిప్పిఁజేసి త్రాఁ
జేరుచు మృత్యుగహ్వర మి♦సీ! నరకం బిఁక వేరెయున్నదే?

మోహన్—హాహాహాహాహా. మామగారూ! ఎంత యుపోద్ఘాత మిచ్చితిరి?. ఇవన్నియు నీర్ష్యచే పలుకువాక్యములు. దాని మహాత్త్వము మీ రెట్లెరుంగగలరు? ఇంతటి సౌఖ్యము నే ననుభవించుచుండఁ జూచుటకు కన్నుకుట్టి యిట్లు పలుకుటయే కాని దాని రుచి మీ రెఱింగియున్నచో నిట్లు పలుకరు. కావలయునందురా రండు అనుభవింపుడు. నే నిప్పించెదను. ఇది మహామంత్రము. మీ కుపదేశించుచుంటిని.

తే. గీ. అవని రామా! యనుచుఁ దప♦మాచరింప
నేమి కల్గునో పరమున ♦ నెవరి కెరుక?
అరయనగు బ్రాంది గ్రోల్చిన ♦ నబ్బు సుఖము
అన్ని యీజన్మమందె యీ♦కన్నుఁగవనె.

కృష్ణ—ఓరి! దుష్టుఁడా! ఇది మహామంత్రమా! ఈ బ్రాంది దేనికి మహామంత్రము? మారణమునకు మహామంత్రము; ప్రపంచ మంతయు నాశనముజేయుటకు మహామంత్రము; ధనమంతయు కొల్లగొట్టుటకు మహామంత్రము; దొంగతనమునకును రంకుతన మునకును మహామంత్రము; ఖూనీలకు మహామంత్రము. ఈ బ్రాంది మొదటిగ్లాసు కుక్కనుజేసి మొరిగించును, రెండవగ్లాసు కోతినిజేసి యాడించును, మూఁడవగ్లాసు దున్ననుజేసి దుమి కించును, నాల్గవగ్లాసు గాడిదనుజేసి నడిపించును, అయిదవగ్లాసు పందినిజేసి బురదలో పొర్లించును. తెలిసినదా? నటుడు త్రాగి నాటకము ధ్వంసముజేయుచున్నాడు. రోగి త్రాగి రోగము నభివృద్ధిజేసికొనుచున్నాడు. వైద్యుడు త్రాగి వ్యాధిని గుర్తింప లేకపోవుచున్నాఁడు. వర్తకుఁడు త్రాగి వ్యాపారమునకు స్వస్తి జెప్పుచున్నాఁడు. త్రాగి ధ్వంసముకానివారెవరు? మోహనా! నీ విట్లగుదువని యెన్నడును తలఁచలేదు.

మ. అనుగుఁ సోదరి యన్నపూర్ణ కడువిఖ్యాతిఁ బ్రవర్తించి స
జ్జనసన్మానిత యయ్యెఁ దత్సుతుఁడవై సౌశీల్యవంతుండ వౌ
దని లోనెంచి కుమారినిచ్చితిని విద్యాబుద్ధులన్ నేర్పితిఁ
జనకుఁ శంకరరావుఁబోలితివి నీచందంబు నేమందుఁ గఁ.

మోహఁ—ఏమీ! నాజనకుని బోలితినా? అగును, నా కాదర్శ పురుషుడు నాతండ్రిగాక యితరు లెట్లగుదురు? ఆతని యద్భుత చర్యలు నాకు బట్టువడక, మీ కలవడునా? నిరంకుశప్రభావుం డగు నాతనిచర్యలనే కంటగించుచుంటివా! ఆతనిప్రభావము నీ వెట్లెరుంగగలవు?

సీ. కాడీలకుఁ కాడి రంగూనుకాడి యఁ
విఖ్యాతి వడసిన వీరుఁడెవఁడు
రక్షకభటశాఖ ప్రక్కబల్లెంబయి
భయముగొల్పిన బాహుబలుఁ డెవండు

నామశ్రవణమాత్ర ♦ నే మానవులగుండె
లురులఁజేసిన భయం♦కరుఁ డెవండు
కనులఁ గాంచినయంత ♦ కామినీహృదయ మా
కర్షించు సుందరా♦కారుఁ డెవఁడు
తే. గీ. అట్టి నీబావమరిది నా ♦ యనుగుదండ్రి
యైన శంకరరావుని ♦ యద్భుతంపు
చరిత వెగటయ్యెనే నీకు ♦ చాలుఁజాలు
కట్టిపెట్టుము నీదు వా♦క్యాళి మామ!

(ఈర్ష్యతో నవ్వి)ఏ విలాసపురుషుని పవిత్రచరిత్ర నాటకరూపమున రచింపఁబడి ప్రదర్శింపఁబడుచుండెనో, యేలోకభయంకరుని నామమును రంగస్థలమున నటుడు ధరించి యభినయించినంత మాత్రమున ప్రేక్షకసమూహమంతయు ప్రేమదృశ్యముల కానందించి, హాస్యదృశ్యములకు కడుపులు వ్రయ్యలగునట్లు నవ్వి బీభత్సదృశ్యములకు జంకి భయానకదృశ్యములకు భీతిల్లి, రౌద్రదృశ్యములకు హడలెత్తి, నాటకాంతమున నిండ్లకేగి, రేయియంతయు నిదురపట్టక, కన్మరగినంతనే శంకరరావు ప్రత్యక్షమై, రంగస్థలమున జూచిన నాటకమంతయు కనులకు గట్టినట్లుండి కలవరమందజేయునో, అట్టి ధైర్యయుతుఁడు, జగదానందదాయకుఁడు, మీ కొక్కరికి మాత్ర మయిష్టుఁడగుట హాస్యాస్పదము.

కృష్ణ—ఆతఁ డంతటి జగదానందదాయకుఁడా! ఆ ధైర్యయుతుఁ డొనర్చిన దుండగములును అందులకు కలిగిన ఫలితమును యోజించితివా?

సీ. త్రాగి తందనలాడి ♦ భోగకాంతలఁ జేరి
కులగౌరవము మంట ♦ గలిపివైచె
అగ్నిసాక్షిగ పెండ్లి♦యాడిన యిల్లాలి
నేలక యిడుమల♦పాలొనర్చె

ఆతిథ్యమిచ్చిన ♦ యనఘు రమేశు భా
ర్యను దోషమెంచక ♦ యపహరించె
ఆస్తి ధ్వంసమొనర్చె ♦ హత్యలెన్నియొ చేసె
శ్వశురునిసైతము ♦ జంపివైచె
తే. గీ. నిన్నియనరాని దుష్కృతు ♦ లెన్నొ చేసె
నాయఘంబులె కొండలై ♦ పోయి తుదకు
గుండెవ్రియ్యలుజేసి యా ♦ దండధరుని
దండఁజేరిచెగాదె యా ♦ ధైర్యయుతునె.

మోహనా! యింత వాగ్వ్యయ మెందులకు? ముందు నీయవ
తార మెట్లు మారినదో చూడుము.

చ. కళతొలఁగెన్ మొగాన తల♦కట్టును చింపిరికంపయయ్యె చె
క్కులు కడులొట్టలాయె కను♦గొల్కులు గుంటలుదంతపంక్తియో
వెలిబడి గారపట్టె పురి♦వీడి కృశించెను మేను కాంతియున్
నెలవెలబారె, తొట్రుపడి♦వీనులకున్ వెగటయ్యె మాటలున్.

మోహన్—వయసు మీరినకొలది రూపు మారుచున్నది. అందబ్బుర
మేమున్నది? మీ రెంతకంఠశోషబడి మొత్తుకొనినను యీ
త్రాగుడు మానజాలను, మానను.

కృష్ణ—ఓరియంధుడా! నాది కంఠశోషయా? నాయుపదేశములన్నియు
చెవిటివానిచెంత శంఖమూదినట్లయ్యెనా? కాలుసేతు లంటగట్టి
పూర్తిగ త్రాగుడను శబ్దమును మరచువరకు చీకటికొట్టులో
బంధింపవలెగాని మంచిమాటలతో నీవు మానుదువా?

సుశీ—ఆఁఆఁ తండ్రీ! నాకాపురము.

మోహన్—ఏమీ! నను బంధింతువా? అది నీతరముకాదుగదా నీ
యబ్బతరముకూడ గాదు. అంత ధైర్యమున్నచో రమ్ము పట్టు
కొనుము. నామార్గము నాటంకపరపుము (అని త్వరగా నిష్క్ర
మించుచుండ)

శ్యామసుం—నాన్నా! నాన్నా! నువ్వుపోతే నేను చచ్చిపోతా. పోవద్దు.
(అని తండ్రిని పట్టుకొన శ్యామసుందరుని క్రిందపడద్రోసి

నిష్క్రమించును) (కృష్ణమూర్తి శ్యామసుందరుని లేవదీసి యెత్తుకొని కన్నీరు తుడుచును.)

సుశీ—అయ్యో, నాథా! పోకుడు! మి మ్మెవ్వరును బంధింపజాలరు. మీ మార్గము నెవ్వరును నిరోధింపఁజాలరు.రండు. రారా? నా మొరా లింపరా? వెనుదిరిగిచూచుటకైన నిచ్ఛగింపరా? హానాథా! మీచరణదాసిపై నింతటి యాగ్రహమా? అయ్యో!మీవియో గాగ్నిని భరింపగలనా?—హా! యింకెక్కడినాథుడు! దైవమా! నేను నాజనకుడుకూడ నాకపకారిమో యయ్యోనే! ఇంతటిబోధకు బాల్పడకున్న నింట నిలిచెడివారేమో. హా! యెంతటివిచ్చి యూహా! ఒకమధుపానమేయైనచో యెంతత్రాగినను నిలుజేరి నను దూషించుచునో బాధించుచునో యింట బడియుండెడి వారు. కాని నరనరములకును వేళ్ళుప్రాకిన వేశ్యామమకార మను విష మింటనుండనిచ్చునా ? ఓసీ బ్రహ్మరాక్షసీ! వారిజా! పెనుభూతమువలె నాహృదయేశ్వరు నావహించి నామనోహరుని నీమాయావాగురలం జిక్కించుకొని మాయెడబాటునకు నా దురంత దుఃఖములకు కారణభూతురాలవైతివా ? ధనమును కామించునీవు రిక్తహస్తుండగు నానాథు నెట్లు వరించితివి? ధన గర్వంబుననున్న మోహాంధులెందరో నీయిలుచుట్టు గుమ్మరు చుందురే. అట్టితరి నానాథుం డొక్కఁడు నీకు లేకున్న గర వగునా? ఓసీ కులటా ! యెంద రవివేకులు నీకృత్రిమ సౌంద ర్యమునకు ముగ్ధులై నీ మోసములకుం జిక్కి నీ కపటప్రేమ నాశించి ద్రవ్యమంతయు నీ కర్పించి దారపుత్రుల కూటికి కర వానర్చి తమభార్యల బాధించుచుండిరో. నీమూలమున నెందరు పతివ్రతాతిలకములు భర్తృముఖదర్శనమునకు మొగము వాచి కుంది కృశించుచుండిరో; యెందరు సతీశిరోమణులు నీ బాహుబంధములనుండి పతులం బొందజాల మని నిస్పృహ జెంది యాత్మహత్య లొనర్చుకొనుచుండిరో; యెందరు యువ తుల కాపురములఁ దీయుచుంటివో; యెందరుయువకుల రక్త

మాంసములఁ జీలిచి వ్యాధిగ్రస్తులుగ నొనర్చి నశింపఁజేయు
చుంటివో కదా? ఇందరు నారీమణుల యుసురులుగొని యింతిం
తనరాని దుష్కృత్యము లొనర్చి నీ వేమి వృద్ధిఁగాంచెదవు?
బహుజనసాంగత్యమున భూలోకమున దుర్వ్యాధులరూపమున
గలుగు నరకబాధ లట్లుంచి యంత్యకాలమున యమకింకరు
లొనర్చు బాధలు చాలక దండధరుఁ డొసంగు ఘోరశిక్షు
లనుభవింపకతప్పునా? వెఱ్ఱిమానవుల వంచింపగలవుగాని పాప
పుణ్యవిచక్షణ నొనర్చి శిక్షించు ధర్మప్రభువును మోసగింపఁ
గలవా? ఇట్లు పాపపంజరమవై జీవించుటకన్న నొకనికి పరిణయం
బాడి సుఖించుచు పర మాలోచించుకొనఁగూడదా? ఓ భారత
మాతా! అరుంధతీ అనసూయాదులవంటి మహాపతివ్రతా
మతల్లులు జన్మించిన నీపవిత్ర గర్భమునం దీమేకవన్నె పులు లనం
దగు వేశ్యాపిశాచము లెట్లుజన్మించిరి? చెట్టు చెడు కాలమునకు
వేరుపురుగు లుద్భవించునట్లు లోకనాశనకాల మేగాంచి యీ
విషసర్పములు జన్మించినవా? హా! హా! - నాగతికి నేను దుఃఖిం
పక యన్యుల దూషించుచుంటి నేమి! హృదయేశ్వరుసాన్నిధ్యమే
కరవైన పిదప నీజన్మ నాకేల? (అని శీఘ్రముగా పరుగెత్తును.)

కృష్ణ—అమ్మా! అమ్మా! సాహసమునకు బాల్పడకుము. (అని
పరుగెత్తును)

---

## చతుర్థరంగము

(వెంకటాద్రిగృహము : శాంత యొంటరిగ కూర్చుండియుండును.)

అనుబంధము 20

శాంత—

మా యిర్వురకును ప్రథమ సమాగమలగ్న మెట్టిదియో
కాని జగన్మోహనుండైన మోహనుఁడు క్షణము కనబడకున్న

పిచ్చియెత్తినట్లుండును. నామమాత్రుండైన పతి యొక్క దుండు టచే నా ప్రేమమూర్తిని సర్వకాల సర్వావస్థలయందును నాదండ నుంచుకొన సాధ్యముగాకున్నది. నేఁడు పతిగ్రామమున లేఁడని కబురంపితిని. ఇంతవరకు రాలేదు. నా యనంగ సుందరునకు ధన మొసంగుచుంటచే నినుపమందసములో ధనము తరుగు చుండుటఁ జూచి నా పతి యనుమానించి తాళపుచెవిగుత్తులు తనయొద్దనే యుంచుకొనుచున్నాఁడు. ధన మీయకున్నచో మోహనుఁడు నన్నుఁ జేరఁడు. క్రితపుదినమున వచ్చినపుడే ధనము లేదనునప్పటికి కటకటబడినాఁడు. అతి కష్టముమీఁద రాత్రి నా పతి భోజన మొనర్చువేళ మెల్లగ తాళపుచెవులను సంగ్రహించి గుండె లరచేత బట్టుకొని కొంతధనము దొంగిలించితిని. ఇఁక నీ వ్యవహారము నడచుట కష్టమగునట్లు తోఁచుచున్నది. మోహనుఁ డీ ధనమంతయు త్రాగుడుకొరకేకదా వెచ్చించు చుండెను. ఎట్లైన నా త్రాగుడు మానివేయుమని నా మోహ నుని బతిమాలెదగాక !

మోహ——(ప్రవేశించి) శాంతా !

శాంత——వచ్చితిరా ? దయచేయుఁడు. (అని చేయిపట్టుకొని తీసికొని వచ్చి కూర్చుండబెట్టి) మీ మాటయే తలంచుచుంటిని.

మోహ——ఏమి తలంచుచుంటివి ?

శాంత——జగదేకసుందరా ! నా పతి మీకు విందొనర్చిన దినమున మీ మోహనాకృతి యెంత యాకర్షవంతముగ నున్నదో యిపు డెట్లు మారినదో చూచుకొనుఁడు. మీ మృదుమధుర వాక్కు లెంత తొట్రుపడి వెగటు గలిగించునట్లు మారెనో తిలకింపుడు. మీ రిట్లు కృశించుట కీ త్రాగుడే కదా కార ణము. మీ రీ దురభ్యాసమును మానివేయరాదా ?

మోహ——ఇప్పటివరకు మామపోరు పడలేక యిచ్చటికి లేచివచ్చితిని. నీకుఁ గూడ ఇదే రోగము పుట్టినదేమి ?

శాంత—కోపగించుచుంటిరా ? మీ బాగుకొరకే కదా నే నేడ్చుట ?

మోహ— నీ యేడుపు నీ వేడువక నా కొరకేడ్చుట యెందులకు ? ఇదంతయుఁ జూడ నేఁడు గూడ నేమియు తీయన ట్లగపడు చున్నది.

శాంత—(తనలో) లేదని చెప్పిన బాగుండున ట్లున్నది. ఇట్లుకూడ ప్రయత్నించి చూచెదగాక.

మోహ—బెల్లముగొట్టిన రాయివలె మాట్లాడ వేమి ? మౌనమే అందుకు సమాధానమా ?

శాంత—కాదు. తీయుటకు వీలు చిక్కలేదు.

మోహ—ఇది బొత్తిగా నమ్మదగినమాట కాదు. నీ కేమి, వీలు చిక్కకపోవుటయేమి ? అయినను నేఁ డుదయ మాతఁడు గ్రామాంతరమున కేగెనని వార్త నంపితివే. ఇఁక నడ్డే మున్నది ?

శాంత—నిజముగనే వీలుచిక్కలేదు. నా మగఁ డనుమానించుచున్నాఁడని మొన్న చెప్పలేదా ? తాళపుచెవిగుత్తుల నాతఁడు గొని పోయెను.

మోహ—నేను నమ్మను. ముందు ధనము దెచ్చియిమ్ము.

శాంత—ఎచ్చటినుండి తెచ్చి యీయవలయును ?

మోహ—మగనిపెట్టెలోనుండి, రంకుమగనికి తెచ్చి యీయవలయును. తెలిసినదా? లెమ్ము.

శాంత—ధనము లేదని చెప్పుటలేదా ?

మోహ—ఇచ్చెదవా లేదా ? (అని జుట్టుపట్టుకొని యూపును.)

శాంత—అబ్బో ! అబ్బో! తెచ్చియిచ్చెదను. వదలుఁడు.

మోహ—(వదలి) ఊఁ. తెచ్చియిమ్ము.

(శాంత లోనికేగును.)




శాంతామోహనరావులు తన ఇంటియందుండగా చూచి వెంకటరావు మోహనరావును పిస్టల్‌తో ప్రేల్చబోవుట.

అది మోహనరావు ఎగురదన్న ఆ పిస్తలు క్రిందపడి శాంతచేతికి చిక్కగా శాంత మగనికే పిస్తలు గురిపెట్టుట.

మోహన్—"దండం దశగుణం భవేత్." ఇట్టిసమయములలో సౌమ్యముగ పనిసాగదు.

శాంత—(ప్రవేశించి) ఇదిగో (అని కొన్నినోట్లిచ్చును)

మోహన్—తరువాత నీమగఁడు తెచ్చుకొనినదానిలో మిగిలినబాపతు.

శాంత—(సీసా గ్లాసు తెచ్చి బల్లపై పెట్టి) ఇదిగో.

మోహన్—నా కిది యొకపనియా? గ్లాసులో పోసి నీవే త్రాగించవలయును. (అని కూర్చుండును)

శాంత—(గ్లాసులో పోసి త్రాగించుచు) తలుపు వేసివచ్చితిరా?

మోహన్—భయములేదు. (అని శాంతను సోఫాలోనికి లాగికొనును)

శాంత—(చేయి విడలించి) మోటసరసములు చాలింపుఁడు.

మోహన్—ఎందుల కంతకోపము? చేతికి పనిచెప్పకుండగనే తెచ్చియిచ్చిన నెంతబాగుండెడిది?

శాంత—చాలబాగుండెడిది. తనమేలు తనకే తెలియదు. (అని మూరొగ్గము పెట్టును)

మోహ—అదియా సంగతి? (అని బలవంతమున మొగము తనవైపు త్రిప్పుకొని ముద్దిడుచుండ)

వెంక—(ప్రవేశించి చూచి కోపముతో) ఓరీ తుచ్ఛుడా!మిత్రద్రోహీ! చచ్చితివిరా. (అని జేబునుండి రివాల్వరుతీయుచు మోహనుని పైకి పరుగెత్తును.)

మోహన్—నేనుకాదు, నీవు. (అని యెదురు పరుగెత్తి వెంకట్రావు జేబునుండి రివాల్వరు తీసినతోడనే రివాల్వరు పడగొట్టి కలియబడును. రివాల్వరు క్రిందపడిన వెంటనే యది శాంత సంగ్రహించి వెంకట్రావు వైపునకు జూపుచు)

శాంత—వెంకట్రావ్! లెమ్ము. నీ కంత్యకాలము సమీపించినది. చేతులు పైకెత్తుము. (అని రివాల్వరు గురిచూపును)

(వెంకటాద్రివు చేతులు పైకెత్తి, వెనుక వెనుక మెల్లగా జరుగు చుండును.)

(మోహనరావు సన్నసన్నగా నడిచి పారిపోవును.)

శాంత—(రివాల్వరు దింపి నవ్వుచు) పాపము ప్రతిజ్ఞాభంగమైనది. మూర్ఖుడా! తప్పంతయు నీయందుంచుకొని సిగ్గులేక యాతనిపై కేగుచుంటివా?

వెంక—ఓసీ! దురాచారిణీ! నాపై రివాల్వరు చూపుచుంటివా? పాపినీ! నీయీ నీచచరిత్రకు భర్తృవధ యొక్కటియే తక్కువైనది. నీ ముఖము చూచిన పాపపర్వతములు చుట్టుముట్టును. నీతనువును వేయిచీలికలొనర్చి యుప్పుపాతరయందూరవైచినను పాపమునిం చదు. నిను తుండెతుండెములుగ ఖండించి కాకఘూకములకు సంతర్పణ మొనర్చినను పాపములేదు. నిను జీవములతో ప్రళ యాగ్నియందు బడవైచి దహించినను జాలిదలచువా రుండరు. వేయిశూలములతో గ్రుచ్చి హింసించినను కరుణకలుగదు. నీ వా దండధరుని సాన్నిధ్యంబున ఘోరశిక్ష లనుభవింపక తప్పదు. నీపాపములకు పరిహారములేదు. ఛీ! యేల నీజన్మ? నీయీదుశ్చ రిత్ర నాలకించి నినుదూషింపనివారుందురా? బాలురుసైతము నీపై రాలవర్షము గురిపించి నిను జావమోదకుందురా? మొగ మున నుమియకుందురా? విశాల ప్రపంచమున నీవు నిలుచుటకు తావుండునా? వంశమర్యాదనంతయు తగులబెట్టుటకు జన్మించి తివా? నాపరువు ప్రతిష్ఠలన్నియు దగ్ధమొనర్చుటకు నాయిలు జేరితివా? ఇంకను సిగ్గులేక జీవచ్ఛవమువలె నిలిచియుంటివా? ఆ రివాల్వరుతోడనే యాత్మహత్య నొనర్చుకొని లోకమునకు శాంతిఁజేకూర్చరాదా? కళంకీభూతమైన నీతనువును గంగకర్పింప రాదా? ఛండాలినీ! ఘోరపాపినీ! పిశాచినీ! ఇంక నీముఖము చూడను. ఛీ! (అని నిష్క్రమించును)

శాంత—(హాహాహా అని నవ్వి) ఈ నీ యుపన్యాసమంతయు నీకును తగి

నదే. పోమ్ము! వారిజముఖము చూతువుగాని నాముఖమేల చూతువు?

మోహన్—(ప్రవేశించి) ఓసీ కులటా! పతి గ్రామమున లేఁడని వర్తమాన మంపి నను ప్రాణాపాయస్థితికి తేనెంచితివా? ఇంత ద్రోహము తలపెట్టితివా?

శాంత—లేదు లేదు; నే నట్లుతలచలేదు. నా మాట నమ్ముము.

మోహన్—ఛీ! నోరుమూయుము. ఇంకను నిను నమ్ముటయా? రంకులాడికి బొంకులు నేర్పవలయునా? విశ్వాసఘాతకీ! నీపాపము బ్రద్దలుకాకుండునని తలఁచితివా? సిగ్గులేక యింకను ఎదురు చెప్పుచుంటివా? ఇంతమోసమా? రాక్షసీ! యింతకింత యనుభవింపుము. (అని గొంతుపట్టుకొని విదలించి క్రిందపడునట్లు తన్ని నిష్క్రమించును.)

శాంత—(మెల్లగా లేచుచు) ఆహా! తుదకు నాకథ యెట్లుపరిణమించినది! ఉభయభ్రష్టత్వము ఉపరిసన్యాసమైనదే ప్రేమాస్పదునిచేత గూడ నిరసింపఁబడితినే! ప్రియుని రక్షించుటకై పతిపై రివాల్వరునెత్తియు నాతని హృదయమును ఘోరగొనఁజాలకపోతినే! శాంతా! యెంత కూరచిత్తవు! వెంకటాద్రీ! నేను ఘోరపాపిని నని నీ వుచ్చరించిన వాక్యము సత్యము. ఉషఃకాలమున నాముఖమును వీక్షించినవారలకు పంచమహాపాతకములు చుట్టుకొనుట సత్యము పర్వతములవలె వృద్ధిజెందిన నాపాపములకు పరిహారములేదు. యౌవనమదాంధనై లజ్జాభిమానముల త్యజించి యెంతటి రహస్య వ్యాపారమునైన నీక్షింపగల సర్వసాక్షి యొకండుకలఁడని యెంచక, నా యఘుదవానలమే జాజ్వల్యమానమై నను దహించితీరునని తలంపక, నా దుష్కృత్యముల కంత్యకాలంబున దండధరుండొసంగు ఘోరశిక్షల నూహింపక, హైందవాంగనలకు మానమే ప్రాణములకన్న మిన్నయనుమాట లెక్కింపక, పతియే

దైవమని యెంచి యాత్మేశ్వరు చరణారవిందముల భజించి సాధ్వియను కీర్తి నొంద నాసింపక, తుచ్ఛరాలనై కామోద్రేక తమఃపుంజంబు గ్రమ్మి కన్నులుగానక మోహనరావుంగూడి యైహికసుఖంబులం దేలి దుష్కీర్తిపాలై తుదకు జీవితేశ్వరుని దృక్పథంబున బడితిని. నాదురుద్యోగంబు నీక్షించి క్రోధాగ్ని జ్వాలలు ప్రజ్వలింప మోహనరావుపై కొక్కుమ్మడి లంఘించిన హృదయేశ్వరుని రివాల్వరు గురిపెట్టి హతమార్చెదనంటిని. నా దుష్కృత్యమునకు రోషకషాయితలోచనుండై యగ్నికణంబులం గ్రక్కుచు నను భస్మీభూతనొనర్ప నుంకించిన ప్రాణదైవమును రివాల్వరు చూపి బెదరించి స్వేచ్ఛావిహారమును సలుప సమకట్టితిని. నే నొనర్చిన నీచకృత్యమునకు సిగ్గుపడి తలవంచి యాత్మహత్య నొనర్చుకొనక జీవచ్ఛవమునై బ్రతికియుంటిని. నాచరిత్ర మూలమున నావంశమునకంతకును కళంక మాపాదించితిని. నా జన్మవలన స్త్రీజాతికంతకును తలవంపులు ఘటిల్లినవి. ఇంక నాకీ జన్మమేల? నే బ్రతికియుంట యెవరి నుద్ధరించుటకు? నాబలవన్మరణమును కనులార గాంచినయెడ నను బోలిన చెడిపెలీ దుర్వృత్తుల మాని పాతివ్రత్య మవలంబించి సుఖంతురుగాక. నాకు నరకమునందుగూడ తావులేదు. అవమానదావాగ్ని నన్ను దహించుచుండ మొండివడి బ్రతికియుండి సిగ్గులేక శిరమునెత్తి ప్రపంచమున జరింపఁజాలను. ఇది నా యంత్యకాలము. ప్రాణపతీ! నా పాపకృత్యములన్నియు మరచిపొమ్ము. నీకు శాంత యను దుశ్చరిత భార్యగ నున్న సంగతి కలలోని వార్తగ దలంపుము. నా జీవితమున కంత మిదియే. నాయఘముల కిదియే శిక్ష. (అని రివాల్వరు పేల్చుకొనబోయి యాగి) కాదు. నే నిప్పుడు మరణింపరాదు. ఘోరకిరాతుఁడు, క్రూరరాక్షసుడు నా యీ దుస్థితికి కారణభూతుడు, మల్లి కాపురమున నగ్నిముట్టించిన తుచ్ఛుడు పతివ్రతాశిరోమణియైన సుశీల యధఃపతనమునకు కారకుడైన రాజారామును హతమార్చి వనితాలోక మిఁక

నిశ్చింతగ నిద్రించుట కిరవేర్పరచి లోకమున కీమాత్రపుసహాయ మొనర్చి రాజారామును బోలిన మిత్రద్రోహుల కట్టిపురస్కరణములు గల్గుట తథ్యమని లోకమునకు జాటి నా ప్రాణముల వీడెద. ఓరీ! చండాలుఁడా! రాజారామూ! నీవిప్పటి కెన్ని కొంపల గూల్చితివో? యెన్ని కొంపల గూల్చుచుంటివో? యెన్నికొంపల గూల్పనుంటివో? యీ రివాల్వరుతో నీదురంతముల కంతముగల్గు కాల మాసన్నమైనది. రాజారామూ! ఇఁక నీవు లేవు. (అని పరుగెత్తును.)

---

## పంచమ రంగము

[మోహనరావుగృహము: సుశీల విచారముతో కూర్చుండియుండును.]

అనుబంధము 21.

సుశీ—

తే. గీ. పూర్వభవమున నే నెట్టి ♦ పుణ్యదంప
తులను విడదీసి యెంతగా ♦ గలచినానొ
పతివియోగాగ్ని నన్నిటుల్ ♦ వెతలఁగూర్ప
బాధపడుచుంటిఁ దొలిపాప ♦ ఫలముకలన.

నాఁడు జనకుం డడ్డుపడకున్నచో నిశ్చింతగ ప్రాణముల విడచియుండెడి దానను.

రాజా—(ప్రవేశించి) ఒంటిగనె యున్నది. కాని సౌందర్య మంతరించినది.

తే. గీ. కరఁగునపు డింత రాగిని ♦ కలుపుకతన
వన్నె తగ్గుచు బంగారు ♦ పరగునట్లు
చింత యనునట్టి మలినంబు ♦ చేరుకతన
మగువసౌందర్య మిసుమంత ♦ మాసియుండె.

ఎట్లైనను కృతప్రతిజ్ఞుఁడనుగాక తప్పదు. ఓరీ ముసలినక్కా! కృష్ణమూర్తి! మల్లితో పొత్తు పోగొట్టగల్గితివేగాని యిప్పుడు నీ కుమార్తెను నే బలాత్కరింపనుంటిని, యేమిచేయుదువో చూచెదగాక! సుశీలా!

సుశీ—(అదరిపడి) ఎవరది? ఓరీ తుచ్ఛుడా! ఎంత సాహసముగ సుశీలా యని పిలిచితివిరా? యెంత ధైర్యముగ నాయింట గాలుపెట్టితివిరా?

రాజా—అడుగులోనే హంసపాదన్నట్లు మాటతోనే చీవాట్లు మొదలు పెట్టితివా? నీమనసింకను మార్చుకొననే లేదా? నేఁ డెట్లైనను నిను పొందక విడువను. ఆలోచించుకొనుము. నా కాగ్రహము గలిగింపకుము.

సుశీ—ఓరీ! చండాలా! నీ యాగ్రహ మెంత? నీ వెంత? సోదరన్యాయ ముగ నాఁడు నే నొనర్చినబోధ యంతయు వ్యర్థమయ్యెనా? నీ కక్కసెల్లెండ్రు లేరా? తల్లికిని భార్యకును గల తారతమ్య మెఱుఁగవా? పరస్త్రీ జననీసమాన కాదా? పశుజన్మ మెత్తితివా?

రాజా—ఓసీ! పలుగాకీ! ఊరకొనుచున్నకొలది నీధోరణి హెచ్చు చున్నదే? అంగీకరింతువా లేదా? చెప్పుము.

సుశీ—ఏమీ? దౌర్జన్యముజూపి బెదరింపనెంచెదవా? నీచహృదయా! నీకు జీవితాశ లేదా? ఛీ!

అనుబంధము 22.

మ. చెడుగా! యెన్నివచించినన్ వినవె? నీ♦చెయ్దంబులన్ మానవే?
దుడుకుంజూపి పరాభవింపఁదలతే? ♦ దుష్టాత్మ! ప్రాణంపుపో
కడ దాపయ్యెనె? జీవితేచ్ఛకలదేన్ ♦ కాపట్యమున్‌మాని, వే
నడు, కాదా? నిలు నాదుకోపశిఖలన్ ♦ మ్రగ్గంగ కీటంబవై.

రాజా—ఓహో! యేమిశాపవాక్యములు! గుఱ్ఱపునకిలింపులకు సింహము భీతిల్లునా?

ఉ. నీపరుషంపువాక్తతికి ♦ నీబెదరింపుల కేను జంకి నీ
దాపును వీడి పారుటకు ♦ ధైర్యవిహీనుఁడనంచు నెంతె? నా
యేపును జూపి బల్మి మెయి♦నిప్పుడె పొందెద నిన్ను మోహపుం
దాపముదీర; నడ్డుపడ ♦ ధాతకు శక్యమె వానియబ్బకేన్.

(సుశీలను బలాత్కరింపఁబోవ సుశీల తప్పించుకొనుచుండును.)

పతివ్రత యగు సుశీలను రాజారాము బలాత్కరింపబోవ శ్యామసుందరుడు
ఆతనిని తన్నుట.

శ్యామసుందరుని కుత్తుక రాజారాము నులిమివేయుచుండ మోహనరా వరుదెంచుట
శాంత చాటునుండి పిస్టల్‌తో రాజారామును చంపుట.

రాజా—ప్రాణములు విసిగించిన నపాయము సంభవింపగలదు. జాగ్రత!
సుశీ—ఛీ! నోరుమూయుము. నీ కాయువు మూడినది.
రాజా—ఎవరి కాయువు మూడినదో చూచెదగాక.
(అని బలాత్కరించి పట్టుకొనబోవ శ్యామసుందర్ పరుగెత్తుకొనివచ్చి)
శ్యామ—నంజకొరకా! అమ్మమీదికి పోతున్నావా? నిన్ను తంతా.
(అని తన్నును)
రాజా—ఓరి పిడుగా! ఇప్పటినుండియే శౌర్యము జూపుచుంటివా? (అని పిల్లవాని మెడపట్టుకొని యూపుచు) సుశీలా! ఇపుడు చెప్పుము కుమారునిపై నాశ వీడుదువా, అంగీకరింతువా?
సుశీ—(ఆత్రముతో) అన్నా! అన్నా! వాని వీడుము. బుడుతని బ్రతుకనిమ్ము.
రాజా—అట్లైన నాకోర్కి దీర్చుట కంగీకరింపుము.
సుశీ—నీ వేమొనర్చినను సరియే. మాయిరువురిప్రాణములగూడ తృణప్రాయములుగ నెంతునుగాని యంగీకరింపను.
రాజా—అట్లైన నీకుమారుఁడిఁక లేఁడు (అని మెడపట్టుకొని యూపును)
సుశీ—అయ్యో! అయ్యో! (అని దుఃఖించుచుండును)
(అంత మోహనరావు ప్రవేశించి, చూచి)
మోహన—ఓరీ! కఠినహృదయా! నీ విఁక లేవు. (అని బాలుని మెడనుండి రాజారాముచేతులు విడదీయుటలో శ్యామసుందర్ క్రిందపడును; రాజారాం మోహనరావులు కలియబడుదురు)
మోహన—రాజారాం! ఈ దెబ్బతో చచ్చితివి.
(అని పోట్లాడుచుండ సుశీల శ్యామసుందరుని జేరును. లోపలనుండి రివాల్వరు శాంత పేల్చును, రాజారాం క్రిందపడును, మోహనరావు తెల్లబోయి చూచుచుండును)
సుశీ—అయ్యో! అయ్యో! కుమారా! పలుకవేమి? నను జూడవేమి? నీప్రాణములకు యమకింకరుఁడై యీతుపాకి యెచ్చటినుండి వచ్చెనురా? తండ్రీ! (అని దుఃఖించుచుండును.)
మోహ—ఈ రివాల్వర్ శబ్దమెచ్చటిది? ఈతం డెట్లు మరణించెను?

వెంకటా్రి—(సైడులోనుండి సగమగపడుచు) శాంతా! యెంతపని జేసితివి! కక్షదీర్చుట కిదియే సమయము. మోహనరావును రక్షకభటుల కెరుకపరచెదగాక. (అని నిష్క్రమించును)

మోహన—దైవఘటన! (అని వెనుకకుజూచి కుమారునిచెంత కేగి) అయ్యో! కుమారా! నీవిట్లు పడియుంటివేమి? ఆతుచ్ఛునితో పోరుచు నీస్థితిజూడనైతినే! శరీరమంతయు కొయ్యబారుచున్నట్లున్నదే. తండ్రి! పరమేశ్వరుఁ డీకిరాతుని నీకొరకే సృష్టించెనా? నా కులవర్ధనుండవని తలంచితినే! మాయనంతర మిన్నిపిండోదకముల వదలవలసిన విధి నీపైనున్నదే. హా! నేను క్రూరరాక్షసుఁడను. నీయీ స్థితికి కారణభూతుఁడను నేను. కుమారా!

చ. జిలిబిలిపల్కు లొల్క చిరు♦చేష్టల ముద్దులుగుల్కు మోము నే
కలగనినట్టిచందమున ♦ గాంచితి నెన్నఁడొ, నేటికిట్టు లీ
తలఁపఁగరానిదుస్థితిని ♦ త్వన్ముఖముం గనుచుంటి గ్రుడ్డినై,
యిలువిడి దుష్పథంబుల వ♦హించి చరించుట నెంతపాపినో!

(అంత సబుయినస్పెక్టరు ఇద్దరుపోలీసులు ప్రవేశింతురు)

సబు—149. ఈతని నరెస్టు చేయుము.

మోహ—నన్నరెస్టుచేయుట యెందులకు?

సబు—ఎందుల కందువేమి? (రాజారామును చూపుచు) ఈతనిని హత్యగావించినందులకు. 149. బేడీలుతగిలించుము. మూడు పందొమ్మిది. ఆపడియున్నవారి నిద్దరిని హాస్పటలునకు జేర్చుము.

[కానిస్టేబుల్ మోహనరావుచేతులకు బేడీలు తగిలించును. ఇంకొకడు రాజారామును లోపలి కీడ్చుకొనిపోయి, తిరిగివచ్చి బాలు నెత్తుకొనిపోవును]

సుశీ—హా! హా! మీమృదుహస్తముల కినుపసంకెలలా?

మోహ—అవును నా కీశిక్ష కావలసినదే. నేను నరరూపరాక్షసుఁడను. అంధుఁడనై తాగ్రి; మోహాంధుఁడనై వెలయాండ్రం జేరి సయ్యాటలాడుచు నాభాగ్యలక్ష్మివగు నిన్ను కన్నులజూడక

బాధించిన తుచ్ఛుడను. కన్నీరుగార్చుచు 'నాన్నా'యని చెంతకరు దెంచినపుత్రుని పడద్రోసిన క్రూరుడను. దుర్మార్గులమోసము లకుం జిక్కి గృహముజేరక మిత్రద్రోహులకు నా యింట జేరుట కవకాశ మొసంగిన పందను. గ్రామము నం బడి చెడి పెలయిండ్లవెంట దిరుగ్మరుచు ఈ తుచ్ఛుఁడగు రాజారాము ఇచటికి వచ్చి యింతటి సాహస మొనర్చుట కవకాశ మొసం గిన చండాలుడను. నా ముద్దుకుట్టని యింతటి దుస్థితికి కారణ భూతుఁడనైన రాక్షసుఁడను నేను. నేనే యింటియం దున్నచో యీ ఘోరకిరాతు డిందు వచ్చునా? నిను బలాత్కరించునా? నా కుట్టని గొంతు పిసుకునా? సుశీలా! నీవు మహాసాధ్వివి. నీ కనేక యిబ్బందుల గల్గించితిని, నినుదూషించితిని. మాంగల్యము సయితము...(అని నెత్తిన చెయ్యిడి) అబ్బా! ఆవాక్యము నుచ్చ రింపఁజాల. ఎన్ని దుష్కృతు లొనర్చినను సహించి నన్నే దైవ ముగఁ దలంచి పుట్టినింటికైన బోక తపించి నను మార్గమునకు త్రిప్ప ప్రయత్నించితివి. వెట్టినై నీ వాక్యముల నెంచనైతిని. దుర్మతినై నీ జనకుని దూషించినను నోర్చుకొంటివి. నీ జన కుఁడు నాపై కోపగింప నీవు నొచ్చుకొంటివి. అంతటి కల్మష హృదయుడనగు నాపై నీ శాపవాక్యముల పిడుగులవలె సైపఁ జాలవైతివి. నీ యెదుట నిల్చుట కర్హుఁడను గాను. పోవు చుంటిని. ఇదియే తుదిచూపు. రక్షకభటులారా! పోవుదము రండు. (పోలీసులతో నిష్క్రమించును.)

సుశీ—హా దైవమా! (యని మూర్ఛిల్లును).



# రంగూన్ మెయిల్

## షష్ఠాంకము

### ప్రథమరంగము

(కారాగృహము)

మోహ — కారాగృహప్రాప్తి! నేనొనర్చిన దుండగముల కీశిక్ష చాలదు. నాకుం దగినది యురిశిక్ష యొక్కటియే. ఓ మహాజనులారా! ఈ కిరాతుని చరిత్ర నాలకించితిరా? పూర్వభవమున గాదూ, ఈ జన్మమున దుర్వ్యసన లోలుఁడనై యే నొనర్చిన రాక్షసకృత్యములకు నాకుం గల్గిన ఘోరశిక్షల నీక్షించితిరా? పరదార యని తలంపక, తనంతఁ దా వలచివచ్చినను హిత ముపదేశింపక, మిత్రద్రోహ మొనర్చుటయని యెంచక, శాంతపుం దాసించినందులకు రాజారాము నా భార్యను నా యర్ధాంగలక్ష్మిని బలాత్కరించిన ఘట్టరూపమున శిక్ష కలిగినది. స్వకాంతను హింసించి పరకాంతల జావమోదినందులకు నా పుత్రుని యధఃపతనమే శిక్షయై వెలసినది. పితృసముండగు మామ హిత ముపదేశింప హాస్యము లొనర్చి, కన్నుమిన్ను గానక దూషించి పిన్నపెద్దల తారతమ్య మెంచక పరుషవాక్యము లాడినందులకు "కాల్సేతులం గట్టి చీకటి కొట్టులో బంధించెద" నన్న వృద్ధశాపవాక్యము సత్యమై, యీ కారాగృహశిక్ష సంభవించినది. నా జనకుఁడైన శంకరరావు భయంకరచరిత్ర నెరుంగుదురు కదా? విషాదాంత నాటకరూపమున గాంచుచుంటిరి కదా? మమ్ములను బోలిన

దుర్వ్యామోహాంధు లీ ప్రపంచమున నెందరుండిరి? పొద్దు గుంకగనే పూర్వసువాసినులంబలె శిరములపై వస్త్రములం గప్పుకొని పానికొంపలం జేరు గౌరవనీయు లీ ప్రపంచమున నెందరుండిరి! మధురసముం గ్రోలి మార్గమధ్యమున నెవరి తోడనైన మాటలాడవలసివచ్చునేమో యని యేలకాయలు నమలుచు తమ నోటినుండి వెడలు మధురస దుర్గంధమును గప్పిపుచ్చనెంచు మహనీయు లీ ప్రపంచమున నెందరుండిరి! ఓ భారతవీరులారా! స్వరాజ్యమో స్వరాజ్యమో యని మొత్తు కొనుచుంటిరే. ప్రపంచమంతయు త్రాగుడుమయమైయున్న దే. స్వరాజ్య మింక నెక్కడనున్నది? మీ దేశమునకు దరిద్రమెట్లు వచ్చినది? అనుదినమును కోటానుకోట్ల ద్రవ్యమును కొల్ల గొట్టుచున్న మధుశాత్రవు నీ దేశమున లేకుండజేసినచో దేశా రిష్టము తీరదా? భరతమాత పరమానందభరితయై మీకు సాక్షాత్కరింపదా? పురపాలక సంఘములవారు చట్టవిరుద్ధముగ సంచరించుచున్న యీ వ్యభిచారిణుల నేల పరిణయము లొనర్చు కొనవలసినదని నిర్బంధింపకున్నారు? ప్రజాక్షేమమున కీవ్యభిచా రము భంగము గలిగించుటలేదా? బోధించియో శిక్షించియో వెలయాండ్రవృత్తుల మాన్పి ప్రజాక్షేమ మేల కోరరు? వారి చెంత కేగినంతనే యధికారులు గూడ నాకర్షింపబడుచుండుట చేతనా? మంత్రిపదవులందు స్వరాజ్యవాదు లున్నప్పుడే ప్రపంచ మున పాపకృత్యములకు మూలములైన మధుపానము వ్యభి చారము అను నామద్వయమును రూపుమాపి పాపపర్వతములు పెరిగి మోయలేక మూల్గుచున్న భరతమాతకు బరువుతగ్గించ నిచో నింక నితరు లున్నపు డెట్లీ దుర్వ్యసనద్వయము నశించి మాతృదేవత సంతోషస్వాంతయై మనగలదు? భారతసోదరు లీ మధు వేశ్యల నమేధ్యముగ నెంచి సుఖింపుఁడు. ఈ దుష్టపిశాచ ముల బారదోలుఁడు. లెండు. అబ్బా! హాహా!

(అని మూర్ఛిల్లును)



## ద్వితీయ రంగము

[మోహనరావు గృహము; కృష్ణమూర్తి; సుశీల; జానకి; మల్లి; వెంకడు కూర్చుండి యుందురు]

మల్లి:—అమ్మగారూ! నేనూ యీ బాద చానాలుపడ్డాను. కుట్టమూర్తి బాబు దయవొల్ల నా దేముడు తాగటం మానేసిండు. నా కాపరం నిలమడ్డది. అబ్బ, అబ్బ! ఆ బాద లేం సెప్పను? అడవిలో యెండిపోన మొద్దులాగనో కుక్కలాగనో పిల్లిలాగనో పుట్టొచ్చుగాని తాగుమోతోళ్ళ పెళ్ళాలుగా కల్లో గూడ కాగోడదు సరిగెందా, నాటకంలో గూడ తాగుమోతోడి పెళ్ళాంయేసక మెయ్యగోడదు. యేత్తే సచ్చిమోవాల్సిందే.

వెంక—నిజంగా సంయానికి కుట్టమూర్తిదొరగారు రాకమోతే ఆళ్ళ కతంతా నాకళ్ళకు సూపించకమోతే తాగుడుపబావంనాకు సెప్పకమోతే నాగతేమయేదో, నాపెళ్ళాంగతేమయేదో, బాబు దేముడునా గొచ్చి మమ్మసన్నిద్దర్నీ కలిపి పున్నెంకట్టుకున్నారు.

కృష్ణ—వెంకడూ! నేను నిమిత్తమాత్రుడను, నీభార్య పాతివ్రత్య మహిమయే మీకు శుభము చేకూర్చినది.

సుశీ—తండ్రీ! నాకుగూడ సాక్షిసమనులు వచ్చుటకు గారణమేమి?

కృష్ణ—ఈహత్యాసందర్భమున నీ వందుంటచే నీనేరము మోహనుడే యొనర్చెనని పోలీసుల కెరింగించి బంధించుటకు ప్రోత్సహించి పంపిన వెంకటాద్రివే హత్య మీయింట నీపతిచే జేయబడినట్లు రుజువుజేయుటకు ఈయుక్తి బన్నియుండును.

సుశీ—ఓరి దుష్టుండా! మ మ్మీస్థితికిందెచ్చినను నీకనుల మంట దీరలేదా? న్యాయస్థానమునంగూడ పరాభవింపందలంచుచుంటివా? విషసర్పమా? నీ వింతకింత యనుభవింపకుందువా? హా! విధీ! వి న్నేమందును? మా యీ విపత్తులకు నీవక్రబుద్ధియేకదా కారణము?

కృష్ణ—అవును, ఇదంతయు విధివిధానమే. కానిచో నిట్లేలజరుగును?

సీ. త్యాగబుద్ధిగలట్టి ♦ దానశీలుం డిటు
సిరిపోయి పేదయై ♦ చెలఁగుటేమి?
దుందుడుకుల నెంతో ♦ దూషించువాఁ డిటు
కలుషాత్మకుల చెల్మి ♦ గాంచుటేమి?
మదిరయే యిల మహా♦మారి యనెడువాఁడు
మధువుదాఁవఁగ తానె ♦ మరగుటేమి
పరకాంతలఁ జూడ ♦ వెరచెడువాఁ డిటు
చెడిపెల వేశ్యలఁ ♦ జేరుటేమి?

తే గీ. పుత్త్రినకు ఆగ తేమి? క♦ళత్రము నిటు
దుఃఖముల ముంచుటేమి? యా♦ధూర్త హత్య
జేసెనను నిందయేమి? తాఁ ♦ జేరుటేమి
కారః; కిది యెంచ విధిచెయ్యి ♦ కాకయేమి?

సుశీ—విధిచెయ్యి! విధాత కింతటిపక్షపాతమా? నావంటివాండ్రి నేడ్పించుటకా వెంకట్రావు రాజారాములవంటి మోసగాండ్రను సృష్టించినది? నన్నుఁబోలు కాంతలకాపురముల గంగగలుపుటకా వారి జనుబోలిన పడుపుగత్తెలను చెడిపెలను జనింపఁజేసినది? నన్నుఁబోలు మానవతులకు పలుబాము లొసంగి నా మనోహరు బోలిన యమాయకుల సర్వనాశన మొనర్చి రాజగండనలపాలొనర్చుటకా బ్రాందిమొదలగు మత్తుపదార్థముల గల్పించినది? ఈ యంటురోగము లావేశించి మనుజుని సామాన్యముగ విడచునా?

తే. గీ. అంటురోగంబులకు వెల♦యాండ్రపొందు
లకును మత్తుపదార్థము♦లకు కుమైత్రి
తకును భేదంబు లే దింత ♦ తావొసంగు
నెవఁ డతని మొదలంట ద♦హించిటీరు.

కృష్ణ—అమ్మాయీ! ఇల్లుకాలినవెనుక దుఃఖించిన లాభమేమి? ఇట్టి దురభ్యాసకు లీ ప్రపంచమున వేలకొలఁది గలరు.

సీ. కక్షలంబెంచి తి♦క్కజనించి యాస్తుల
నల్పమూల్యంబుల ♦ కమ్మినైచి
ద్రవ్యంబు చేపట్టి ♦ దావా లనియెడు జు
వ్వాటల సాగించి ♦ న్యాయవాది
కోర్టు కాఫీ హూటేల్ ♦ పోర్టువైన్ మొదలౌ ని
షావస్తువులు వెల♦చాన రైలు
డాక్టరు మార్వాడి ♦ యాక్టర్లనెడి నవ
గ్రహముల బోషించి ♦ కల్గుధనము
గీ. పరులవశమును పరదేశ♦వశ మొనర్చి
దేశదారిద్ర్యమునకు స్వ♦నాశమునకు
ముఖ్యకారణభూతులై ♦ ముష్టియెత్తు
వెంగళప్పలు భువి వేన♦వేలు గలరు.

కనుక కూలినగృహమును నిలుపుకొన యత్నింపవలయును. వారిజద్వారా వెంకట్రావు వీతనిచే నొకప్రోనోటుపై సంతకము చేయించి ప్లెయింటుచేసి యీ మేడను ఫైలుజప్తు చేయించెను. నీవిభునిస్థితి సరిగలేదని నీపేర ఆనోటు ఫోర్జరీయని పిటీషను పెట్టించితిని. నేషనల్ బ్యాంకు వేలపుటాస్తికి డెబ్బదియైదు వేల్లు నీ పేర నేచెల్లించి వేలము కన్ఫరం (Confirm) కాకుండ జేసితిని. నీపతివిడుదలకై శక్తివంచన లేకుండ ప్రయత్నించుచుంటిని.

మల్లి—అమ్మగోరూ! బయపడమాకండి! మేమిద్దరం సాచ్చికమిత్తాం. యీళ్ళిద్దరిమీనా నేను శార్జియిచ్చాను. అదికూడా యివ్వాళే వోయిదా. రాజారాం సచ్చినా వెంకట్రావుమీద యిసారణ కాకతప్పదు. ఆళ్ళసంగతులు మామిద్దరం బాగా యెరుగుదుం. ఆళ్ళు మీకు చేసిన ద్రోహాలు కూడా యెరుగుదుం. మనదొర గోరి మంచితనంగూడా యెరుగుదుం. కోర్టులో నిజమంతా బద్ద లేత్తాను. యెప్పటికైనా నాయమే గెలుసుద్ది. బగమంతు డిలా పరీచ్చచేసి ఆకరికి సుకమే సూపిత్తాడు. మనదొరగోరేంది ఆణ్ణే సంపటమేంది! పాపం తప్పకండా పగిలి చంపినోళ్ళాళ్ళంత టోళ్ళే బయటపడకమారు.



మోహనరావు కేసు విచారణసమయమున శాంత యరుదెంచి రాజారామును చంపినది తానేనని నేరమొప్పుకొని తనను తాను పిస్టల్‌తో ఆత్మహత్యజేసికొనుట, మోహనరావు నిర్దోషియని న్యాయాధికారి విడుదలచేయుట.

సుశీ—తండ్రీ! యెట్లైనను కానిమ్ము. ఎట్టిపరాభవము జరిగినను ఎవరెట్లు తలంచినను న్యాయస్థానమున కరుదెంచి నామనోహరు నాపత్సముద్రమునుండి తప్పించుటకై సాక్ష్యమిచ్చెదను. వెంకట్రావు సమనుచేయించినందులకు కాదు; నాప్రాణదైవమును నాకు దక్కించుకొనుటకై సాక్ష్యమిచ్చెదను. కాని వారిజవకీలు నా సాక్ష్యము విచారించుటలో నెట్టి కఠోరప్రశ్నల వైచునో యనుభీతి కలుగుచున్నది.

కృష్ణ—అమ్మా! అది నే నెరుగనా? గౌరవాంగనలను కుంటిప్రశ్నలు వైచిన న్యాయమూర్తి యోర్వఁడు. అట్లు జరుగకుండ ముందు గనే న్యాయమూర్తికి విజ్ఞాపనపత్రము దాఖలు చేయుదము.

సుశీ—అట్లైన సరియే. ఆపైన పరమాత్మునికృప యెట్లున్నదో యట్లు జరుగుగాక. (తల్లి నుద్దేశించి) అమ్మా! న్యాయస్థానమునకు నీవుకూడ రావా?

జానకి—అమ్మాయీ! నిన్నొంటిగఁ బంపుదునని తలఁచితివా?

సుశీ—అట్లయిన నిఁక నేమి! తండ్రీ! ప్రయాణముగండు. హే జగద్బాంధవా! మాపై నీకృపావీక్షణముల బ్రసరించుట కిదియే యదను. (అనుబంధము 23)

(అందఱును కలిసి నిష్క్రమింతురు.)

---

## తృ తీ య ర ం గ ము

[న్యాయస్థానము: న్యాయమూర్తి కూర్చుండియుండును. పబ్లిక్ ప్రాసిక్యూటర్, శర్మ, చౌదరి యను నిద్దరు వకీల్సుందురు. మోహనరావొకప్రక్క బోనులో నిలబడి యుండును. ఇర్వురు పోలీసులు కాపుందురు. ఇంకొక బోనులో వారిజ నిలువఁబడి యుండును. శర్మ వారిజను విచారించుచుండును. వెంకట్రావు చౌదరి సామీప్యములో కూర్చుండి యుండును. కృష్ణమూర్తి శర్మకు దగ్గరగా నుండును. సుశీలా జానకు లొకచో కూర్చుండి యుందురు. కొంచెము దూరములో వెంకడు మల్లి కూర్చుండి

యుందురు. బెంచిక్లార్కు ఫైల్సు చూచుకొనుచుండును. కోర్టు జవాన్ సైలెన్సు అని కేకలు వైచుచుండును.]

వారిజ—మోహనరావు నను బలాత్కరించి నే నంగీకరింపకపోవుటచే చావమోదెను.

శర్మ—నీ కుల మే మంటివి ?

వారి—కళావంతులము.

శర్మ—(I request the court to note this point.) ఐ రిక్వెష్టు ది కోర్టు టు నోట్ దిస్ పాయింట్. కళావంతులంటే (dancing girls) డ్యాన్సింగుగర్ల్సు వారిజా! ఏవిధంగా బలాత్కరించాడు?

చౌదరి—ఏమి (Question) క్వశ్చనండీ అదీ? Meaningless question) మీనింగ్‌లెస్ క్వొశ్చన్. ఏ విధంగా బలాత్కరించాడంటే ఆడది యేం చెప్తుంది ?

శర్మ—భోగందాన్ని బలాత్కరించడం అంటే అసలు (Meaningless) మీనింగ్‌లెస్. ఏమి వారిజా ! మాటలాడవేమి ?

వారి—నన్ను చెరచటానికి మీదికివచ్చెను.

శర్మ—మహాపతివ్రతవు గనుక? పోనీ బలాత్కరించేప్పుడు యెవరన్నా చూచారా?

చౌదరి—అదేమిటండీ! ఒంటరిగా నున్నసమయంలో యెవరన్నా బలాత్కరిస్తారుగాని.

శర్మ—(Please don't interfere in the middle) ప్లీజ్ డోంట్ ఇంటర్‌ఫియర్ ఇన్ ది మిడిల్. (Your Honour) యువర్ ఆనర్! యిలా అయితే (It is very difficult to proceed on with the case) ఇటీస్ వెరీడిఫికల్టు టు ప్రొసీడ్ ఆన్ విత్ ది కేస్.

చౌదరి—నోటికివచ్చిన ప్రశ్నల్లా వేస్తూవుంటే సహించి వూరుకోవడం అంతకన్నాకష్టం యువర్ ఆనర్!

శర్మ—(బల్లగుద్దుచూ) తలతిక్కఛార్జిలు యిస్తూవుంటే (Cross Examination) క్రాస్ ఎగ్జామినేషన్‌లో (Fact) ఫ్యాక్టు బయటపడ యాలా, అక్కర్లేదా?

చౌదరి—చేతనైతే నిజం నిర్ధారణచెయ్యటానికి మార్గాలే లేవా?

శర్మ—చేతకాందీ నీకు. Your Honour! My friend is wasting my time unnecessarily యువర్ ఆనర్! మై ఫ్రెండ్ ఈస్ వేస్టింగు మై టైమ్ అన్నెసెసర్లి.

జడ్జి—(Go on) గో ఆన్ (Next) నెక్స్ట

శర్మ—మాటమాటకు అడ్డుతగుల్తూవుంటే విచారించేదేమిటి? నీవుదిగ వచ్చును.

(వారిజ బోనుదిగుచుండ పబ్లిక్ ప్రాసిక్యూటర్ లేచి వారిజనుజూచి)

ప్రాసి—నువ్వలక్కడదానే వుండుమీ. (జడ్జివంక జూచుచు) (Your Honour!) యువర్ ఆనర్! (Murder case) మర్డర్ కేసులో యీమెనుదా రెండు ప్రశ్నలు అడగవలసివుండింది.

జడ్జి—(Yes) యస్.

ప్రాసి—యేమితల్లి! మోహన్‌రావు నీకు బాగా తెలిసివుండును కాదా?

వారి—యెరుగుదును.

ప్రాసి—ఆయన నిండా తాగుమోతు.

వారి—అవును.

ప్రాసి—వ్యభిసారంకూడా వుండును?

వారి—అవును. సంపూర్ణవ్యభిచారి.

శర్మ—అది నీవెట్లెరుగుదువు?

వారి—అందరునూ చెప్పుకొనుచుండుటచేత.

శర్మ—వెంకటావు నిన్ను.........

వారి—భార్యాభర్తలవలెనే యుంటిమి.

శర్మ—యీ ఛార్జి పెట్టించిన దాతడే?

వారి—అవును... కాదు. నేనే పెట్టితిని!

శర్మ—(Your honour, note this also) యువర్ ఆనర్ నోట్ దిస్ ఆల్సో "అవును. కాదు." యిక నీవు పోవచ్చును. కాదు. కాదు. యింకొకమాట, మోహన్‌రావును బాగుగ తాగించి యేబది వేల రూప్యములనోటుపై సంతకముచేయించితివి కాదూ?

చౌద—ఆసంగతి యిక్క డనవసరము.

శర్మ—అవుసరము గనుక నే యడుగుచుంటిని. ఏమి వారిజా ?

వారి—నే జేయించుటయేమి ? ఆతడే చేసెను.

శర్మ—సాక్షులు వెంకట్రావు రాజారాంలు.

వారి—అవును.

శర్మ—ఇఁక నీవు పోవచ్చును. జవానూ! సుశీలను పిలువుము.

జవాను—(సుశీలా సుశీలా యని కేకలువైచును. సుశీల ప్రవేశించి బోనెక్కును)

(బెంచివార్కి ప్రమాణము చేయించును)

శర్మ—అమ్మాయీ వెంకట్రావు రాజారాంలకును నీపతికిని స్నేహము కదా ?

సుశీ—అవును.

శర్మ—యెప్పటినుండి యభివృద్ధినందినది ?

సుశీ—రంగూన్ మెయిల్ కొట్టుకొనిపోయినప్పటినుండి.

శర్మ—నీపతి వీరితోగలసిపోయి రెండు మూడు దినములు యింటికే రాకుండ నుంటకూడ గలదు.

సుశీ—అవును.

శర్మ—వెంకట్రావు నీపతికి విందొనర్చినట్లును అందు కొన్ని పానీయములు త్రాగించినట్లును వింటివిగదా.

సుశీ—అవును వింటిని.

శర్మ—ఈ హత్యాదినమున నేమిజరిగినదో క్లుప్తముగ జెప్పుము.

సుశీ—రాజారా మరుదెంచి నన్ను బలాత్కరింప నుంకించుచుండ నా బుడుత డరుదెంచెను. నే నంగీకరింపకపోవుటచే రాజారాం కోపించి నాపుత్రునిమెడ పిసుకుచు నన్ను బెదరించెను. నాపతి యరుదెంచి యీ ఘోరదృశ్యమునుజూచి, యాతనిపై బడెను. ఇర్వురును కలియబడిరి. ఇంతలో నెచ్చటనుండియో రివాల్వరు పేల్చినశబ్దమయ్యెను. తోడనే రాజారాం పడిపోయెను.

శర్మ—అప్పుడు నీపతిచెంత రివాల్వ రున్నదా ?

సుశీ—లేదు.

చౌద—ఉంటేమాత్రం చెప్తుతుందా యేమిటి? యేమి టా పిచ్చప్రశ్న?
శర్మ—గౌరవముతప్పి మాటలాడకుము. చెపుతుందా ? యేమిటి ?
(Your Honour ! Family, Lady. Ill-treatment) యువర్ ఆనర్ ! ఫ్యామిలీ లేడీ. ఇల్‌ట్రీటుమెంటు జరక్కుండా చూడవలసిందని నాప్రార్థన.
జడ్జి—(Don't behave foolishly Mr. Choudary) డోంటు బిహేవ్ ఫూలిష్లీ మిష్టర్ చౌదరీ.
శర్మ—ఆశబ్ద మెచ్చటనుండి వచ్చెనో చెప్పగలవా ?
సుశీ—బైటనుండి వచ్చినదని పోగవలన గ్రహించితిని.
శర్మ—సరి. అమ్మా! ఇఁక మీరు వెళ్ళవచ్చును.
ప్రాసి—ఉండుమీా. రాజారాంను నీమొగుడుదానే నంపినాడు.
సుశీ—నాభర్తగారు చంపలేదు.
ప్రాసి—సరిదా, ఇంక పోమీా.
శర్మ—జవానూ ! మల్లిని పిలువుము.
జవా—(మల్లీ మల్లీ అని కేకలువేయును, మల్లి బోనెక్కును) (బెంచి క్లార్కు ప్రమాణము చేయించును)
జడ్జి—పోస్పటలుకు యొకచీటి వ్రాసి జవాను కిచ్చి పంపును.
శర్మ—మల్లి! రాజారాం వెంకటూవులమీాద చార్జి యిచ్చినావు కాదు?
మల్లి—అవును.
శర్మ—యెందుకో ?
మల్లి—యీాల్లిద్దరూ కల్చి నాకాపరం తీశారండి. నన్ను సెడగొట్ట ప్రయత్నం చేశారండి. యీా ఛ్ఛుత్తతాగుమోతు లండి. ముండలెంట తెగతిరుగుతా రండి. సాలాకొంపలు తీత్తుండా రండి. సుశీలమ్మగోరి కాపరం తియ్యానానికూడా సిద్దమడ్డా రండి. మోహనయ్యగారికి తాగుడునేర్పిం దీళ్లేనండి. యీాబోగవా మెకీ మోహనయ్యగారికీ లంకెట్టి ఆయనసొమ్మంతా కాజెయ్యాలని యీాళ్ళూహాండి. రాజారాం వోమాలి నాకు డబ్బిచ్చి నామీాన కొచ్చేతల్కి కుట్టమూర్తిగారూ నాదేముడూ కల్చి నన్ను రచ్చించారండి. అందుకని చార్జియిచ్చానండి. రాజారాంని

మోహనయ్యగారు సంపిండ్రింటే నమ్మకూడదండి. ఆయన సాలా మంచోడండి.

శర్మ—సరే ఇక నీవు పోవచ్చును. జవాను! వెంకని పిలువుము.

జవాను—(యెంకడూ! యెంకడూ అని కేకలు వేయును. యెంకడు బోనెక్కును)

బెంచిక్లార్కు—(ప్రమాణము చేయించును).

శర్మ—వెంకడూ! నీవు వెంకట్రావుగారి కమతగాడవు కదూ?

వెంక—యెనక.

శర్మ—తరువాత యెందుకు మానితివి?

వెంక—నన్ను బాగా తాగించేవోడండీ రోజూ. యెందుకో అనుకుండా, నా పెళ్లాన్ని నన్నూ యిడదీసి దాన్ని సెడగొట్టడానికి. ఆ సంగతి తెల్చాక మానేశానండి.

శర్మ—వెంకట్రావు వెప్పుడూ యింటిదగ్గర వుండేవాడు కాడు.

వెంక—యెప్పుడూ పెళ్లాం మొకమే సూసేవోడు కాదుండి.

చౌద—అన్నీ నీవే చెప్తూ అతన్నడగట మెందుకూ? సాక్ష్యం నీవే యివ్వకూడదు?

శర్మ—ఇప్పుడు నీప్రమేయమేమీ లేదు. అనవసరంగా అడ్డుతగలకు.

చౌద—అడ్డుతగిలే దేమిటి? (బల్లగుద్దుచూ) (Your Honour) యువర్ ఆనర్! ప్రతిముక్కా తానే అందిస్తూ అతనిచేత గంగిరెద్దులాగా తలూపించట మెందుకు?

శర్మ—నీసాక్షులను నీవు విచారించేప్పుడు నీవుకూడా యింతకన్న యెక్కువగానే అందిస్తావు. కావాలంటే చేతనైతే (Cross Examination) క్రాస్ఎగ్జామినేషన్‌లో పడగొట్టు.

చౌద—ఏమిటి పడగొట్టేది కేసంతా ధ్వంసంచేస్తూ?

శర్మ—(బల్లగుద్దుచూ) ధ్వంసంచెయ్యడ మేమిటి? నాపక్షం గెలవాలని నాకుమాత్రముండదూ? (Your Honour! I cannot proceed with the case unless my friend keeps quiet) యువర్ ఆనర్ ఐ కెనాట్ ప్రొసీడ్ విత్ ది కేస్ అన్లెస్ మై ఫ్రెండ్ కీప్స్ క్వయట్.

జడ్జి—(Mr Choudary! Don't disturb him) మిష్టర్ చౌదరీ! డోంట్ డిష్టర్బ్ హిం.

శర్మ—వెంకటాద్రిన్ యెప్పుడూ యెక్కడవుంటూవుండేవాడో తెలుసునా?

వెంకడు—సారాకొట్లంబడి, సానికొంపలెంబడి.

చౌద—(కోపముతో) అది నీ కెలా తెలుసును?

వెంకడు—నాకు తెలీదా? యెప్పుడూ ఆళ్ళింటికాడే పడుండేవోణ్ణి. అప్పుడప్పుడూ నన్నెంబడెట్టుకెల్లి నన్నో కాడ తాగిత్తా, తానోకాడ తాగుతా వుండేవాడు.

చౌద—ఇక నీవు పోవచ్చును. జవానూ! వెంకటాద్రివును పిలువుము.

(జవాను వెంకటాద్రివును కేకలువేయ వెంకటాద్రివు బోనెక్కును; బెంచిక్లర్కు ప్రమాణముచేయించును.)

చౌద—వెంకటాద్రివుగారూ! మోహన్ రావు వారిజను బలాత్కరించిన మాట నిజమా?

వెంక—అవును.

చౌద—మీ రింట లేనప్పుడు మీభార్యనుగూడా బలాత్కరిస్తూంటే మీరు వచ్చి విడిపించారా?

వెంక—అవును.

చౌద—మోహన్ రావుకూ మీకూ విరోధంకదా?

వెంక—అవును.

చౌద—మోహన్ రావు రివాల్వరుతో రాజారాంను చంపటం మీరు చూశారా?

వెంక—చూచితిని.

చౌద—ఆ రివాల్వ రేమైందో?

వెంక—బావిలో పారవైచెను.

చౌద—ఈ సంగతి పోలీసులకు తెలియపరిచారా?

వెంక—అవును.

శర్మ—చంపేటప్పుడు మీరు చూచానని చెప్పినారుగదా? మీ రెందుకు వారించలేదు?

వెంక—అడ్డుపోయిన నన్నుకూడా చంపునేమో యను భయముచేత.
శర్మ—మోహన్‌రావుగారూ మీరూ నేషనల్ బ్యాంకు డైరెక్టర్లు కదూ?
వెంక—అవును.
శర్మ—అటువంటప్పుడు, మీ యిద్దరికీ విరోధ మెట్లుసంభవించింది?
వెంక—అనేక కారణము లుండును.
శర్మ—హత్యజేయుట చూచితినని చెప్పినారే, మీకు విరోధియైన మోహన్‌రావుయింటికి మీ రప్పుడు వెళ్ళవలసిన అవసర మేమివచ్చిందో ?
వెంక—రాజారాం కొరకు.
శర్మ—రాజారాంను మీరే సుశీలను బలాత్కరించుమని పంపితి రన్నమాట.
వెంక—లేదు. లేదు. ఆతడు వారియింటివైపు వెళ్లెనని యెవరోచెప్పిరి. రాజారాంతో అవసరమైన పనియుండి వెతకికొనుచు వెళ్లితిని.
శర్మ—తరువాత ?
చౌద—తరువాత యింకేముంది? చంపడం చూచాడు. చొప్పదంటు ప్రశ్న లన్నిని.
జడ్జి—మిష్టర్ శర్మ! వై డు యు వరీ ఎబౌటిట్? (Mr. Sarma! Why do you worry about it) (చీటి వ్రాసి సబుయిన స్పెక్టరు కిచ్చును. సబుయినస్పెక్ట రదిచూచుకొని వెంకటావ్రు వారిజల చేతులకు బేడీలు వేయును. వారిజావెంకటావ్రు లొకరి మొగ మొకరు చూచుకొందురు)
(అంత హాస్పటల్‌నర్సు శ్యామసుందర్‌ను ఎత్తుకొనివచ్చును)
శ్యామ—అమ్మా ! అమ్మా !
సుశీ—నాయనా ! శ్యామసుందరా !
జడ్జి—(No. No. Bring him here) నో నో బ్రింగ్ హిం హియర్.
(శ్యామసుందర్‌ను బల్లపై కూర్చుండబెట్టును)
జడ్జి—(పండు చేతికిచ్చి) బాబూ ! ఆబోనులో నిలిచినదెవరు ?
శ్యామ—మానాన్నగారే.

జడ్జి—రాజారాం నెరుగుదువా నీవు ?

శ్యామ—లాజాలామా ? అవును. మలే, మాఅమ్మమీాది కొత్తేను నేను తన్నేను. అప్పులు మలే వాలే నాగొంతు పత్తుకోని పిసికాలు. ఆపై నేమైందో నాకు తెలీదు. నేను కల్లు తెరచి చూచేప్పటికి ఈయమ్మ నాదగ్గిల కూచోనుంది. (అని నర్సునుచూపును) మాఅమ్మదగ్గిరికి పోవొద్దూ ?

జడ్జి—పో. (నర్సునుచూచి) (Hand over this boy to his mother) హేండోవర్ దిస్ బాయ్ టు హిజ్ మదర్ (నర్సు శ్యామసుందరుని సుశీల కప్పగించును)

జడ్జి— (Go on with the orguements) గో ఆన్ విథ్ ది ఆర్గుమెంట్సు.

చౌదరి—(Your Honour)! మోహన్‌రావు స్టేటస్ మారుటకు వెంకటాద్రి వారిజలు కారణం అని చెప్పటం చాలా ఆశ్చర్యకరమైన విషయం. వెంకటాద్రి ధనికుడు. కొన్ని యున్నతపదవుల నొంది యున్నవాడు. అట్టివాడీ తాగుబోతుతో స్నేహము చేసి యాతని నీ స్థితికి దెచ్చెననుట కల్ల. మోహన్‌రావు పుట్టుకతోడనే క్రూరస్వభావము కలవాడు. అందుల కీతని తండ్రిచరిత్రయే తార్కాణము. ఆత డొనర్చిన క్రూరకృత్యము లన్నియు రంగూన్‌రౌడీ యను నాటకరూపమున రచింపఁబడి యున్నవి. ఈ విషయములో నే నింతకన్న నెక్కువ చెప్పదలచలేదు. (But I like to file this Rangoon Roudy book for Your Honour's perusal and to know the fact) బట్ ఐ లైక్ టు ఫైల్ దిస్ రంగూన్‌రౌడీ బుక్ ఫర్ యువర్ ఆనర్సు పెరూజల్ అండు టు నో ది ఫ్యాక్టు (అని పుస్తకము దాఖలుచేసి కూర్చుండును.)

పాసి—(Your Honour!) యువర్ ఆనర్ ! నేనుదా చెప్పదలచిందేమిటంటే; మోగన్‌రావు మొదటనుంచీ దుర్మార్గుడన్న సత్యం చెప్పవాల. రాజారాం సుశీలమ్మను బలవంతం చేసినమాట వాస్తవంగానే తలచండిమీా. ఆ సంగతి పోలీసు

వాళ్ళతో సాక్ష్యవిడిసి వుండవలసింది. అట్లా చెయ్యక రివాల్వరుతో కాల్చి పారవేసివుండె. రివాల్వర్ పారవేసిన మాటకూడా సత్యందానే. పోలీసులను మోసంచెయ్యటానికి అట్లు చేసివుండె. మోగర్‌రావ్ కాండక్టు (conduct) వెంకట్రావ్ వారిజమ్మ ప్రూవ్ (Prove) చేసిదావుండె. మోగర్‌రావు రాజారాంను చంపేడన్నమాటకు సందేగంలేదు. పెళ్లాన్ని యింకోడు బలాత్కారంసేసి పూడుస్తూవుంటే, చూసి యెవడు సగించుకుంటాడు? అందువల్ల మోగంరావు చంపినమాట అవశ్యం నమ్మి తీరవలా. అందుకని తోడనే మోగర్‌రావును సిచ్చించవాలా. అని కోర్టువారిని నిండా పార్రిథింస్తూవుండాము (అని కూర్చుండును).

శర్మ—(Your Honour!) యువర్ ఆనర్! మోహన్‌రావు యీస్థితికి రావటానికి కారణం వెంకట్రావు వారిజా రాజారాంలే నని నమ్మినట్లు వీళ్లనిప్పుడు (arrest) అరెస్టు చెయ్యటమే ప్రబల నిదర్శనం. దాన్నిబట్టి వస్తుతః మోహన్‌రావు మంచివాడని వేరే చెప్పనక్కరలేదు. తండ్రివంటివాడే కొడుకైనాడని చెప్ప వీలులేదు. శంకరరా వీతనిబాల్యమునందే చనిపోయినాడు. రివాల్వరుశబ్ద మెచ్చటనుండియో వచ్చినట్లు సుశీల చెప్పుచున్నది. మోహన్‌రా వంతసాహసముచేయువాడు కాడనియు చాల మంచివాడనియు వెంకట్రావు రాజారాంలు దుర్మార్గులనియు ఖూనీకారులనియు మల్లీవెంకడుల సాక్ష్యములవల్ల తేలుచున్నది. వెంకట్రావువారిజలు కలసి యేబదివేలరూప్యములకు నోటువ్రాసి కృత్రిమవ్యాపారమున మోహనరావుచేత సంతకముచేయించి O. S. $\frac{1039}{38}$ నెంబరున ప్లెయింటుచేసి ఫైలుజప్తు చేయించుటచేతను నిన్నటిదినమున మునసబుకోర్టులో సదరు O. S. $\frac{1039}{38}$ నెంబరు వ్యాజ్యములో దాఖలయిన ప్రోనోటుఫోర్జరీ యని నమ్మికోర్టువేయుటతో వీరికృత్రిమస్వభావములు పూర్తిగ వెల్లడియగుచున్నవి. కనుక కోర్టువారు కనికరించి నిర్దోషియగు మోహన్‌రావును విడుదలచేయగలందులకు తమఘనతను గూర్చి మిక్కిలిగ ప్రార్థించుచున్నాను.

జడ్జి—(I believed the case) ఐ బిలీవ్డు ది కేస్. మోహన్‌రావ్! నీవే హత్య జేసినట్లునమ్మితిని అందుకు నీవేమైన చెప్పుకొనెదవా?

మోహ—నమ్మినపిదప యేమి చెప్పిన యేమిలాభము?

(జడ్జి జడ్జిమెంటు వ్రాయుచుండును)

శాంత—(శిరోజముల విరియబోసుకొని పరుగెత్తుకొని వచ్చి) మోహన్‌రావు నిర్దోషి. మోహన్‌రావు నిర్దోషి. న్యాయాధిపతీ! తీర్మానమును వ్రాయకుఁడు.

జడ్జి—నిర్దోషియని నేను నమ్మజాలను.

శాంత—నీవెట్లునమ్మెదవు? కూటసాక్ష్యములపై నాధారపడి యబద్ధములే నిజములనినమ్మి శిక్షలువిధించునీవు సత్యాసత్యముల నెట్లెరుంగగలవు? రాజారాంను వధించినది నేను.

జడ్జి—కారణము?

శాంత—కారణ మెరుంగనెంతువా? నే నెవరో యెరుగుదువా? ఏ చండాలుడు నను పరిణయంబాడి యొక్కదినమైనను సుఖపెట్టక బాధించెనో, యేమదాంధుడు రాజారాంనుగూడి రేయింబవళ్లు త్రాగుచు పడుపుగత్తెలయిండ్ల బానిసమై చరించెనో, యేకఠిన హృదయుడు మల్లి వెంకడులదాంపత్యమును విడదీయుటకు రాజారామునకు తోడ్పడెనో, యేదురాశాపరుడు మోహన్‌రావుపై కపటవాత్సల్యముప్రకటించి సద్గుణగరిష్ఠునకు విందునందు సారాయమును త్రాగించెనో, యేదుర్బలుడు తనయుంపుడుకత్తెయగు వారిజను మోహనరావునకు తార్చెనో, యే మిత్రద్రోహి మోహన్‌రావును సర్వనాశనమొనర్ప యత్నించెనో, అట్టి క్రూరరాక్షసుఁడగు యీవెంకట్రావునకునామమాత్రభార్యను నేను. ఇఁక నాతని నెందులకు చంపితినందురా? ఏ మిత్రవంచకుఁడు నాజననీజనకుల మోసగించి నన్నీ వెంకట్రావుకంటగట్టించెనో, యే కుటిలస్వభావు డీవెంకట్రావును కీల్బొమ్మగజేసి యాడించుచు నాకు గాకుండజేసెనో, యేతుచ్ఛుడు నాకాపురము గంగ గల్పి నే నితరులపాం దాసించునట్లు చేసెనో, యేమోహాంధుఁడు మల్లికాపురము మంటగల్ప యత్నించెనో, యే

దురాత్ముడు యమకింకరునివలె సచ్ఛీలయగు సుశీలను భంగమొనర్ప సాహసించెనో, యేకిరాతుడు నే వెలిచవుల మరగి నాబ్రతుకు బయటపడుటకు కారణభూతుడయ్యెనో, ఆరాజారాం నా కవమానము ఘటిల్లినసమయమున జ్ఞప్తికి వచ్చి యాదుష్టుడు జీవించియున్న నింకెన్నిసంసారముల కగ్ని ముట్టించునో యని రోషానలజ్వాల వెలిగ్రక్కుచు రాజారాం రాజారాం అని కేకలిడుచు పరుగెత్తి మోహన్‌రావుయింటిలో మోహన్‌రావుతో పోరాడుచున్న రాజారాంను యీహస్తముతో యీ రివాల్వరుతో వీధినుండియే కాల్చి చంపినది నేను. ఇది సత్యము. మోహన్‌రావు నిర్దోషి. ఈవిషయమున మీరు నా కెట్టిశిక్షయు విధింపనక్కరలేదు. ఇదియే నాకు ఘోరశిక్ష. (అని రివాల్వరుతో కాల్చుకొని చచ్చును)

మోహ—హా! శాంతా! యెంతసాహస మొనర్చితివి! (పోలీసులు శవమును బైటకు లాగుదురు.)

జడ్జి—(తీర్మానమును వ్రాసి) ఈ కేసులో మోహన్‌రావు నిర్దోషి యనియు హత్యయొనర్చినది శాంతయనియు శాంతవాఙ్మూలమున తేలినది గనుక మోహన్‌రావును మర్యాదపూర్వకముగ విడుదల చేయుడమైనది. ఇతర వాఙ్మూలముల మూలముననుశాంత వాఙ్మూలమువలనను రాజారాం వెంకట్రావు వారిజలే యీదురంతములకు కారణభూతులనియు వీరే మోహన్‌రావును మోసగించి రనియు తేలుటయేగాక మల్లి చార్జీలో రాజారాం కన్నగూడ యాతనికితోడ్పడిన వెంకట్రావునియందే యెక్కువనేర మున్నట్లు తేలుచున్నది. ఇందు శిక్షాపాత్రులు కావలసిన ముగ్గురిలో రాజారాం మరణించినందున వారిజా వెంకట్రావు లిద్దరకు యావజ్జీవము అండమాన్ దీవుల నుండునట్లు శిక్షవిధింపబడినది. (Life transportation).

(మోహన్‌రావును విడుదలచేయుదురు. వారిజా వెంకట్రావులను పోలీసులు గొంపోవుదురు. సుశీలాజానకులు సంతోషముతో మోహనుని జేరుదురు)

కృష్ణ—పాపఫల మూరకవిడుచునా?

శర్మ—మిస్టర్ చౌదరి! ఆకలౌతోంది కాఫీతాగివొద్దాం రా. (అని యిర్వురూ చేతులు కలుపుకొని నిష్క్రమింతురు. కృష్ణమూర్తి మోహన్ రావు సుశీల జానకి శ్యామసుందర్ వెంకడు మల్లి ముందుకు వత్తురు. వెనుక తెరపడును.)

(అంత గోవిందరావు పరుగెత్తుకొని వచ్చి)

గోవిం—మోహన్ రావుగారూ! నమస్కారములు.

మోహ—(ఆశ్చర్యముతో) గోవిందరావ్! రంగూన్ మెయిల్ కొట్టుకొనిపోయినప్పుడు నీవందు లేవా?

గోవిం—ఉంటిని. మేమువ్రాసిన యుత్తరములు మీకు చేరలేదా!

కృష్ణ—వెంకటాద్రిపు కృతిప్రియవ్యాపారమున నీ యుత్తరములన్నియు పోస్టువానిని మోసగించి సంగ్రహించుచున్నట్లు వింటిని.

గోవిం—ఇంకనేమి? ఆతడే సంగ్రహించియుండును. రంగూను మెయిలొక యరగంటకేతము యీరేవు జేరినది.

సుశీల—(ఆత్రముతో) ఇది నిజమా?

గోవిం—అమ్మా! మీతో నబద్ధమాడుదునా? ఆరీతి తుపానునందు కొట్టుకొనిపోబడిన రంగూన్ మెయిల్ కొంతకాలమునకు అరేబియా దేశమునందలి అజెండా హార్బరు చేరినది. మా దురదృష్టమున మార్గమధ్యమున నోడలేమియు తగులలేదు. అజెండాలో నొకనౌకాధిపతి నాశ్రయించితిమి. ఆ దయార్ద్రహృదయుడు యింజెనుకు పిస్టన్ రాడ్ వేయించి మన యోడలోని ప్యాసింజర్లనందరను బొంబాయిలో రైలుటిక్కెట్లను భత్యఖర్చులను యిచ్చి వారివారియిండ్లకు బంపెను. ఓడలోనిసరుకితర యోడలపై రంగూనుకంపి మనకొరకాతడు వెచ్చించినధనమును మనయోడ బొంబాయి అజెండాలనడుమ నాలుగు పర్యాయములు సరకులతో త్రిప్పి రాబట్టుకొని దారిభత్యముక్రింద మాకు కొంతధన మిచ్చి పంపెను. మే మచ్చటనుండియే యొక డ్రైవరునుతీసికొని బొంబాయి కరాచీలనడుమను బొంబాయి సింహాళ

ద్వీపములనడుమను సింహళద్వీపము, రంగూనులనడుమను కొంత వ్యాపారముసాగించి తుదకు రంగూనునుండి ప్యాసింజర్లనెక్కించుకొని నేడు కాకినాడజేరితిమి. ఇప్పటివరకైన కర్చులుపోను తొంబదియైదువేలాదాయము కనుపించినది.

మోహన్—(సంతోషముతో గోవిందరావును కౌగిలించుకొని) గోవిందరావు) నీ ఋణము తీర్చుకొనజాలను. ఇకనుండియు నీవు నా గుమాస్తావుకావు. నా భాగస్వామివి. మామగారూ! బ్యాంకు వేల మైపోయినదా?

కృష్ణ—మోహనా! నీ ఋణ మేబదివేలరూప్యములును నీ జామీనుపై నష్టపోని దివాలాతీసిన నారాయణరావుఋణ మిరువదివేలును కోర్టులో నేను చెల్లించితిని.

మోహన్—మామగారూ! నాతప్పులన్నియు మన్నింపుడు. (అని నమస్కరించి) గోవిందరావ్! యిప్పటివర కార్జించిన ధనమంతయు మామగారి కప్పగించుము. సుశీలా! నీవు సార్థకనామధేయవు. నీ పతివ్రతాప్రభావముననే మరల మన భాగ్యదేవతయగు రంగూన్ మెయిల్ మన నష్టము లన్నియు పూడ్చుకొని మనకు సాక్షాత్కరించినది.

సుశీ—ప్రభూ! ఇదంతయు మీ యదృష్టమే.

మోహ—కాదు. నా శ్యామసుందరునియదృష్టము (అని యెత్తి ముద్దాడును)

కృష్ణ—మీయిద్దరి యదృష్టములును బాగుండబట్టియే మీకష్టములు తొలగినవి. మోహనా! మన వెంకడు మల్లి.........

మోహ—మరచితిని. వెంకన్నా! మీదంపతులు నాచెంత నుండుడు. మీ కేవిధమైన లోపమును లేకుండ మిమ్ము నేను పోషించుటయేగాక కొంతయాస్తి నొసంగెదను. స్వేచ్ఛాజీవనము నల్పుడు. ఓమహాజనులారా! ఇంతటి పర్వదిన మింక నాకు లభింపదు. ఈ సంతోషసమయమున నేజెప్పబోవు స్వల్పవాక్యముల నాలకింపుడు.

సీ. పరబోధనల విని♦పరభామినులఁ బట్టి
పరిభవింపఁగఁ జూచు♦పరమఖలులు
మిత్రవంచకులౌచు ♦ నిండఁగ త్రైలఁజేరి
బ్రాంది సేవించెదు ♦ పాపయుతులు
తమయాస్తి ఛాలక ♦ కుమతులై యన్యుల
సొంపలు గూల్చెడి ♦ కుటిలమతులు
రాజగాం వేంకట♦రావులం బోలుచు
క్షోణి జరించెదు ♦ కుత్సితులును

గీ. వృద్ధి జెందరు నే మన♦శ్శుద్ధిగాఁగఁ
బలుకుచున్నాఁడ నెవ్వరీ ♦ ఫక్కి జనక
ద్రోహచింతల నన్నింటి ♦ ద్రోసిపుచ్చి
దేశసేవను జేయుఁ డో♦ధీరులార !

మామగారూ! యింక కావలసిన దేమున్నది?

కృష్ణ—ఇంక నొక్కటి మిగిలియున్నది.

సీ. మెంబరుషిప్పుల ♦ మెరయ వోటర్లకు
కల్లుసంతర్పణల్ ♦ గడుపువారు
ఉన్నతపదవుల ♦ నొంద భామినులను
తమయధికార్లకు ♦ దార్పువారు
దవ్యమంతయును దు♦ర్వ్యసనాలకుఁ బెట్టి
తార్పుడుగాండ్రౌచు ♦ దనరువారు
జేనెకుపాట్లకై ♦ మానంబు నమ్మి యూ
ర్జించు రోచెల్వలు ♦ చెడిపెయువతు

తే. గీ. లింక నిట్టి దుర్వృత్తుల ♦ వంకబోక
గంజతాగి ముతుకగుడ్డ♦గట్టి, మాతృ
దేశదారిద్ర్యమును మాప ♦ దేశసేవ
గోరి భరతమాతకు శోభ♦గూర్తుగాత.

సర్వేజనాః సుఖినోభవంతు;

మంగళం.



# అనుబంధములు

ప్రార్థన. సామాజికులందరూ కలసి
(దుప్రద్ — తాళం.)

శ్రీనాథా - మందరగిరిధారీ ॥
మురళీధరా - అసురారీ ॥
గరుడగమన - కరుణాభరణా
పరంజ్యోతి-స్వరూప కృపగని
సూత్రధారివై రంగానుమెయిలునాటకము జయప్రద
మాగతి జరుపగదె - సుజనజీవ-నాధార - శౌరి - మురారి ॥

అనుబంధము 1

మల్లీ వెంకల డైలాగు—బీ౯ పలాస్ - తితాల్.

వెంక—శలాకి - వాలపుల - బాలా - సాలా - కులుకే - పలుకోలుకే॥
తలేది - కోలగ - సూజే - వోలోలే - పులకలు - గలిగే॥
మల్లి—సాలోయిక - పులకలుగలవా - వలపు తెలియగలవెటుమగడా ॥
పోలానె- కాక - రేలు - యిలుకడ - నిలువవు - పలుకగనేలా ॥
వెంక—శలో క్తి - పలుకులవేలా - పలుకగ - సెలియా - రావేలా
ఇలాగ - నిలువగ - సాలా - నీకేలా - యలుకలు - సిలకా ॥
మల్లి—సాలదె - సరసన - సరిగా - నిలబడ - పోలయలుకలెవలెనా
కులాస - పోల - సేయి - కలిపెద-కులికెద-వాలపుల-మొగడా॥

అనుబంధము 2

సుసీల—యమ౯ - తితాల్.

భోగము - శాశ్వతమా - భువి నాధా॥
యీాగతిబలుకా - నేమనగలనే ॥
పొగుల౯ - దగునే - పోడిమి - పోవా
జగతి - తామసమె - సడలక - యుండునే.
ఒగితామరచెలి - వేగమెరాడె
వగపునీగతిని - తగులగనగునె ॥

అనుబంధము 3

సుశీల—జోగియా - దాదా్ర.

దేవా యిదియే సరళమ ॥
భవమురోసి పలుకా॥

అవమానము - నాత్మదలచి
జీవములే - చెడుతలపా
భువిబాధలు - పొలయుతరిని
సహనము - వలదా ॥

అనుబంధము 4

వెంకమ్మా, మల్లి, డైలాగ్—మిశ్రకాఫి - యేకతాళం

వెంక...ఓలోలె - నంజ - యేమె - వోమిండ-గానిజేరి
సయ్యాట - లాడి - సం - తోసముగను - కులికితివె॥
యెన్నెన్నో - బొంకులాడి - యెంతోతమాచా సూపి
నాకళ్ళుకప్పినావె - నాకొద్దుపోవె గండ॥
మల్లి...యేపాపమెరుగనయ్యో - నేసచ్చిమోతా సాయిూ
ననుకొట్ట మోకూ - నేదన్నంపెడత - నన్ను కాయి॥
నీవే నా దేవుడానీ - నీమీన మనసునిలిపి
నినునమ్మియుంటి నిజము - నామాటనమ్మ పభువ॥

అనుబంధము 5

సుశీల—జోగియా - జప్‌తాల్

దీనజనపోషణ - దానవహారి
మానిసురనుతపదా - మానన రమాధవా॥
నానిధాన మటుల - నడిజలనిధిఁ
కానరానటులై - దీనతగూర్పఁ
నేను వాపోవగా - నావిభుగటా
మానుషాంతకులస్నే-హాన నడుపఁ మోలా॥

అనుబంధము 6

వారిజ, దుర్గ—ఏకతాళం - (సునోసునో మాదిరి)

గనా - నహో - మోదామూ యే॥
తనువా - కనకా-కాంతులనీనూ॥
వన మే మననౌ - మారసమా
మననము - ననుదని - యూ లేకా
యూనన - తేనెల - నానాగోరూ
కనులవె - మదనా - త్రముులయినా

మనంబు - నేచి - దీనతను
గనగా - జేయుదహా - యీవేళా॥
ధనమున - కగు - నామానసమే
నీనిపాదముల - వాత్రిలాజూచూ
ఆనన - నీరజ - మాకర్షించీ॥
తనువా-పులకిత-మాయెగదా-దరిజేరా కా-నిలువాజాలా
మనోహరాకృతి - నే-నే - గొల్తూ॥

అనుబంధము 7

మల్లి— జోగియా - జప్‌తాల్

యేపాప - మేనెరుగ - నేమందు - నిటులాయె॥
నా యిబుకు - మొరయినడె - నాదరికి - జేరడే॥
యిటుల యె-న్నాలో యి - కేదారియో నాకు॥
యెందుకీ - చందమే - మందునే - దేవుడా॥
కడుపు మల-మలమాడు - కాసింత - కూటికే
మొగమువా-చితిగదా - మొగుడేల - రాడయో॥

అనుబంధము 8

సుశీల—శంకర్ - తితాల్

ఈవిధము - నేమననానో॥
భవితమెదో - భావింపజాలా
నావిభుడే - నను గనడే
భవమున నెటులా - మనగలనయ్యో॥

అనుబంధము 9

సుశీల—మిశ్రి - దాద్రా

పావని నీ - పాదములా - భక్తిగొల్తునే॥
కావగదే - రా వెయికా - నీవెగతిగదే॥
దేవీ నీ - చరణములా - భావమునా దలచీనా
యే వేళా యేయిడుమల్ - రావుగదే యోమాతా!
నావిభుడే - నాడిటులా - పోవగలేదే
బ్రోవగదే - కృపజూపీ - నాథు శాంకరీ॥

అనుబంధము 10
సుశీల—మిశ్రి - దాదా్రి

కరుణలేదా - కావరాదా॥
మొరవినబడదా - గిరిజాతా॥
నిరతమును నీ - చరణయుగమునే
గోరితలతూ నా - హా
భరింపగలనా - బాధా మాతా
నీరజాక్షీ - నీలవేణీ॥

అనుబంధము 11
శ్యామసుందర్—భాగేశ్వరి - దాదా్రి

నేనొల్ల-నే బువ్వ - నానాన్న - రాకా॥
నాన్నతోడ - నన్నముతిని, శానాళ్ళు - గడచెనయ్యో
యెన్నడు నే, తిననుగాదె, నాన్న లేక యొంటిరిగ

అనుబంధము 12
శాంత—కాఫీ - తితాల్

వాద - నాపై - లేదా ప్రేమా॥
మదనరూప - సుకు-మార మోహనా
నీదయారసము - నేకోరా॥
ముదమిడరాదా - మొరవినబడదా
నాదువార్తవిన-లేద మోహనా॥

అనుబంధము 13
మోహనుడు—మిశ్రిమాండు - తితాల్

మదనాగ్నికి - మదిదూలుదు
మదగమన - మా - శాంత
గదియు-గా - నెపు - డానో॥
సాదర-మున నను - మదవతి గూర్చా
నీదయ - బరపుము - నీరజ-నాభా
గాదిలి - జూపగ-దే యని - కొలిచితి
నీదిన-మున ముద - మందితి - శాంతా॥

అనుబంధము 14

సుశీల—మిశ్రీ - దాద్రా

పూత-చరితవు - గాదే॥
అతివగోడు - వినవే మాతా॥
పతియరిగే - రాడే
నాతరమె - విభుని
గతిదెలియా - కృపా
మతి - భవాని పతి నర్జేర్పవె॥

అనుబంధము 15

సుశీల, బిర్పలాస్—తితాల్

అలసితి - రకటపభు॥
జాలిగొలుపు నీ-సరళి॥
యేలనిలువ - పూలసెజ్జ
వాలుడో ప్రియా
మెలమెల - మృదుపదాల
కేల - నొత్తెదా
సోలు - దీర్చెదా॥

అనుబంధము 16 మోహనుడు, భైరవి—యేకతాళం

కలదె యిలలోన - గాలించిగనా॥
పోలా - బ్రాందిసరి - భోగమరయా
తెలియగలవె నీ-తెలివి కబలా

సాకి

Mix zin and whisky మిక్సు జిన్ అండ్ హ్విస్కి
Have cakes and flesh హ్యావ్ కేక్సు అండ్ ఫ్లెష్
Eat and drink fully ఈట్ అండ్ డ్రింక్ ఫుల్లీ
Enjoy with the beauty ఎంజోయ్ విత్ ది బ్యూటి
This is the gentry fashion. దిస్ ఈస్ ది జెంట్రి ఫేషన్

అనుబంధము 17

సుశీల, బీర్పలాస్—ఖవాలి

తగదా - పదదాసి - గావ॥
ఖగ-వాహ-నా-కనవా॥

వగపీ వి-ధమున - గొలుపా
తగునా హా - యశుభ - మగునా
రాగా - నిధాన - గావా
దగు - రావె - రాధ - రమణా॥

అనుబంధము 18
మోహనుడు, భైరవి—తిశాల్

యలుకు-పిడచ నయ - మాగద - తెలియా॥
వెలవెల-దుకకా - వెలగల - సొగసూ॥
బేలా! - యన వెల-చెలి పలు - వేసం
బులతో - వెలిగెడు - కనులను - గనకా
యూలా - తాగుచు - యిలువిడి - గణికా
వలపులను - కలలనక - తగిలి - తకట॥

అనుబంధము 19
మల్లి, యమన్—తిశాల్

దినములు - గడచే - దేవుడు - యిడచీ॥
యెటులా - నా సాయికి - దయ - గలుగూ॥
యెన్నా - లీగతి - యేడుతు - నయ్యో
పానమె - పోదిక - బాధలు - వాయా॥
దైవమ దయరాదా నా-మీనా
నాసామీ - నను - నేలగ దయతో
జేయరాదో - సేతును - బజనా
యెపుడుగ - మరువా - యెంకటరమణా॥

అనుబంధము 20
శాంత, మాండు, ఏకతాళం.

మరువగా - నౌన - మదన-మోహనా యొమో
హా నా............మధురాధరా॥
కరుణాల-వాలా - ప్రేమా
గాన............జాలనేడా
సరి, పోలువారి నిన్నా
భారమా - గదా - నిలువ - దరిలేనిచో॥

అనుబంధము 14

సుశీల—మిశ్రీ - దాద్రా

పూతచరితవు - గాదే॥
అతివగోడు - వినవే మాతా॥
పతియరిగే - రాడే
నాతరమె - విభుని
గతిదెలియా - కృపా
మతి - భవాని పతి నర్జేర్పవె॥

అనుబంధము 15

సుశీల, బిన్‌పలాస్—తితాల్

అలసితి - రకటప్రభు॥
జాలిగొలుపు నీ-సరళి॥
యేలనిలువ - పూలసెజ్జ
వ్రాలుడో ప్రియా
మెలమెల - మృదుపదాల
కేల - నొత్తెదా
సోలు - దీర్చెదా॥

అనుబంధము 16 మోహనుడు, భైరవి—యేకతాళం

కలదె యిలలోన - గాలించిగనా॥
పోలా - బ్రాందిసరి - భోగమరయా
తెలియగలవె నీ- తెలివి కబలా

సాకి

Mix zin and whisky మిక్సు జిన్ అండ్ హ్విస్కి
Have cakes and flesh హ్యావ్ కేక్సు అండ్ ఫ్లెష్
Eat and drink fully ఈట్ అండ్ డ్రింక్ ఫుల్లీ
Enjoy with the beauty ఎంజోయ్ విత్ ది బ్యూటి
This is the gentry fashion. దిస్ ఈస్ ది జెంట్రి ఫేషన్

అనుబంధము 17

సుశీల, బీన్‌పలాస్—ఖవాలి

తగదా - పదదాసి - గావ॥
ఖగ-వాహ-నా-కనవా॥

వగపీ వి-ధమున - గొలుపా
తగునా హా - యశుభ - మగునా
రాగా - నిధాన - గావా
దగు - రావె - రాధ - రమణా॥

అనుబంధము 18

మోహనుడు, భైరవి—తితాల్

యలుకు-పిడచ నయ - మాగద - తెలియా॥
వెలవెల-దుకకా - వెలగల - సొగసూ॥
బేలా! - యన వెల-చెలి పలు - వేసం
బులతో - వెలిగెడు - కనులను - గనకా
యీాలా - తాగుచు - యిలువిడి - గణికా
వలపులను - కలలనక - తగిలి - తకట॥

అనుబంధము 19

మల్లి, యమన్—తితాల్

దినములు - గడచే - దేవుడు - యిడచీ॥
యెటులా - నా సాయికి - దయ - గలుగూ॥
యెన్నా - లీగతి - యేడుతు - నయ్యో
పానమె - పోదిక - బాధలు - వాయా॥
దైవమ దయరాదా నా-మీానా
నాసామీా - నను - నేలగ దయతో
జేయరాదో - సేతును - బజనా
యెపుడున్ - మరువా - యెంకటరమణా॥

అనుబంధము 20

శాంత, మాండు, ఏకతాళం.

మరువగా - నౌన - మదన-మోహనా యొమో
హా నా.............మధురాధరా॥
కరుణాల-వాలా - ప్రేమా
గాన.............జాలనేడా
సరి, పోలువారి నిన్నా
భారమా - గదా - నిలువ - దరిలేనిచో॥

అనుబంధము 21

సుశీల, మాండు – తితాల్.

గొలుపవా - సంతసము దైవమా॥
చాలదా - పరీక్షా॥
జాలమేల - బేలనుగావా
మేల - వియోగద-వానల - కీలల
గాలగ-జేయా - దేవా॥
కూలదోసితి-నో-తొలిజన్మ౯
గోలల - ప్రేమల - బాపుచు -
తెలియజాల - శౌరీ॥

అనుబంధము 22

సుశీల, బ్యాగ్ – చతురశ్రగతి.

క్రూరమానసా - కోరికోరి మరణము నా-సింతు వెచ్చీ - ధూర్తుడా॥
నారిననుచు న౯ - ధీరతజూపి ప-రాభవింపక, పోర కలుషుడా
మీరి కాలుని-బారికిజేరవె - ఘోరదవానల మోరి పతివ్రత॥

అనుబంధము 23

సుశీల, భాగేశ్వరి – తితాల్.

రాధా-రమణా - రావా హా॥
మధుర-మురళిధర - రావా॥
మా-ధా-వా-(శ్రీ)-నా-థ॥
బాధ - వాప - రావా జగతి
నాధ - తరి యి - దేవా
సాధు-శీలు-డవు - గాదా
మందా- రా-ధా-రా-హా॥



సామాజికులందరు కలిసి, [illegible]

బ్యాండు, ట్యూ౯ – రూపకం.

భరతమాత - పావనచరితా - సురూపవై
ధీరమానసా - వీరమాతవై సదా
కరవులేక - సస్యవృద్ధి - కూర్చి-బ్రోవవే జై
నేరముల్ - క్రూరముల్-జరగనీక బిడ్డల౯ - కావగదె-మాతా.
ఓం నమో భగవతీ.

# సవరణపట్టిక



| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 9 | 18 | కొత్త | కూంత |
| 10 | 18 | మించనసని | మించినపని |
| 10 | 22 | అట్లయితే ఆపనేం | (Omit) |
| 13 | 22 | చిత్తలని | అనృతములని |
| 23 | 17 | మొగులు | మొగుడు |
| 33 | 21 | చూచుచుండుము | చూచుకొనుము |
| 34 | 13 | తెమ్ము అట్లైతాగెదను | (Omit) |
| ,, | 15 | (నవ్వి) (తరువాత) | స్వామీ! (కలుపవలెను) |
| 35 | పద్యములో రెండవపాదముచివర | హత్తుచుక | రాచుచుక |
| 46 | 7 | భారతసాధ్వీ | భారతసాధ్వుల |
| 50 | 21 | నొనర్చుచు వీలులేక | నొనర్చుచురావీలులేక |
| 55 | పద్యము మొదటి పాదము | నేమ్వ్వమనగ, నీర్గార్పు | నేమ్వ్వమన గన్నీర్గార్పు |
| 60 | 1 | సుందరాంగి | ఈసుందరాంగి |
| 62 | 18 | నిన్నాంతని | నిన్నాతని |
| 63 | గీతం 3-పాదము | దుర్గభవభర్గ వేగనాదువిభు నింక | దుర్గవే వేగనాదు చేతోవిభుండు |
| ,, | 4 | జేర్చి | జేర |
| 74 | గీతం 3-వపాదము | సొగసుదోచు | సొగసుగుల్క |
| 88 | చంపకమాల మొ॥ | కళతొలగెగ మొగాన | కళలునశించెమోము |
| ,, | రెండవపాదము | లొట్టలాయె కనుకొల్కులు గుంటలు | లొట్టలెకనులుగుంటలు జెందెను |
| ,, | నాల్గవపాదము | వెగటయ్యె | వెగటొప్పె |
| 97 | రెండవగీతము 3 పాదము | యనునట్టిమలినంబు | యను మలినము మది |
| 100 | 3 | కెరుకపరచెద | కప్పగించెద |
| 101 | 18 | పిడుగులవలెనైప | పిడుగులవలెనైవ |
| 103 | 12 | మధుశాత్రవు | మధుపిశాచము |
| 105 | సీసము | మధువుద్రాక్షరంగ | మధురసంబును |
| 115 | 27 | దుర్మార్గుడన్న | దుర్మార్గుడన్నమాట |

తొలుత నీసవరణల పాఠమునం దొనర్చుకొని చదువుట కుద్యుక్తులగుదురుగాక యని మా పాఠకుల హెచ్చరించుచున్నాము.

# కోకిల

(గ్రంథకర్త:—పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు)

ఇది యొక అపూర్వవిచిత్ర కల్పనాసమేత మగు చక్కని
కము. కోకిల ధవునికై తండ్రిని త్యజించిన త్యాగశీల. భవ్యతర ప్ర
దముల సుందరోద్యానముల సంచరించు సతీతిలకమైనను— భ
కూరమృగసంకీర్ణ భీకరారణ్య రంగమున నిజధీరచారిత్రాభినయ
మోహాంధు డగు మోహనుని హృదయాగారమున ప్రేమజ్యోతిని
గించి, దమయంతీ అనసూయాదుల మరపించిన పాతివ్రత్యవి
అసూర్యంపశ్యయైనను పురుషుల భోగలాలసతాతృప్తికై నిర్మింప
క్రీడాపదార్థములుగాక సతులు పురుషులకన్న నేమిటను త
కారని లోకమున చాటుటకో యన రాజ్యపరిపాలనాభారము వహి
రమణీమణి. ఈ నాటకము శృంగారరసమునకు నిలయము. శృ
మున కరుణ. కరుణయందే బీభత్సము, దాన రౌద్రము, దాని
హాస్యము. అంతయు నొక్క రంగమునందే! పసితనమునందే త
డ్రుల బాసి, కారాగారమున బద్ధుడై, వేదాంతియైన వసం
వేదండయానకు దా .. డై కథానాయకత్వమును వహించును. తర
విచారణస్థానమున ప్రాణయిని కోకిల; విచారణీయస్థానమున నింద
ప్రేమస్వరూపి యగు జనకుడు, దైవసముడగు ధవుడు. విచార
భూమి యురికంబప్రాంతము. నేరారోపణచేయునది తల్లి. దీన ప్ర
మున స్థాపింపబడు నీతి తరుణీమణుల యవ్యాజప్రేమ. ఈ యత్య
సంఘటనాశక్తియు, తన్నిర్వహణనైపుణియు, స్త్రీలను పు
జేసి, పురుషున కబలవేసము నిచ్చి, యపూర్వప్రణయసంభాష
నల మేళవించు శేముషి. యీకవిశేఖరునియందే, యీకవి విరచి
నీకోకిల నాటకమునందే చూడదగును. వెల రు. 1—0—0 మా

వలయువారు:—